# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కల్పితము

సంపుటము 23 అక్టోబర్/నవంబర్ 1980 సంచికలు 10—11



## చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు "....12/--80" అనియుండిన, మీ చందా డిసంబర్ నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు 8రూ॥) నవంబర్ నెల 30వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

## —: శ్రీ వారి కార్యక్రమములు : —

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతినిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను లేదా కొత్తచెరువు నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

---

సంవత్సర చందా 8 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును. వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 22

వైదికోపాసనః— ఇది నాలుగు విధములుగ వున్నది. (1) సత్యవతి (2) అంగవతి (3) అన్య వతి (4) నిదానవతి, అని.

“సర్వవ్యాపిన మాత్మానం క్షీరేసర్పిరివార్పితమ్” పాలలో నెయ్యి కలిసివున్నట్లే ఆత్మ సర్వవ్యాప్తమై ఉన్నదనే భావముతో చేసేసాధనే సత్యవతీ ఉపాసన అంటారు.

“మాయాతీతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా” నేనీ సమస్తంలో అవ్యక్తంగా వ్యాపించివున్నాను. నన్ను అంతటా నాలో అంతటినీ చూస్తూ ఉండే సత్యవతి ఉపాసనకు నేను కనుపించకుండా ఉండను. నాకు ఆ ఉపాసకుడు కనుపించ కుండా ఉండడు అంటూ ఉన్నాడు మాధవుడు.

ఆ సర్వాత్మనే నిప్పు, గాలి, సూర్యుడు చంద్రుడు (మొదలైనవన్నీ) అనేభావముతో చేయ బడేదే అంగవతీ ఉపాసన. ప్రాణరూపమై అంద రికీ ఆత్మీయమైన ఆ గాలి అన్నింటినీ వెలిగించు అగ్ని ప్రాణములకు వివిధ జీవనాధారములైన అన్నము ఉత్పాదన చేయటానికి కావలసిన వరుణ (వర్షము) అని పరమాత్మను పొగడుట అంగవతీ ఉపాసన.

“శంఖచక్రగదాపాణీ” అని విష్ణువును, “ఏక దంతగజాననా” అని విఘ్నేశ్వరుని, “శూలపాణి” అని ఈశ్వరుని, “కోదండపాణి” అని రాముణ్ణి, “శిఖిపించమౌళి మురళీధర” అని కృష్ణునీ, “వీణావాణి” అని సరస్వతిని ఇలా ఆయాదేవతల చిహ్నములను ధ్యానపూర్వకంగా మనస్సునుతన్మ

యము చేసుకొని హృదయంలో ఆరాధిస్తూ ఉండ టం అన్యవతీ ఉపాసన అని అందురు.

"శ్రవణం, కీర్తనం, విష్ణోఃస్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం, ఆత్మని వేదనం తన్మయాసక్తి, పరమ విరహాసక్తి" అని పదకొండు భక్తి సాధనలు కూడా నిదానవతీ ఉపా సనలో చేరును.

సత్యవతీ, అంగవతీ, అన్యవతీ, నిదానవతీ ఉపాసనలు అనుక్రమీణా వకదానికంటే వకటి అత్యుత్తమ స్థితికి కారణాలై విశ్వనియంతతో తాదాత్మ్యాన్ని ప్రసాదిస్తాయి.

ప్రతీకోపాసన అని మరొకటి ఉన్నది, అది అంగవతీ ఉపాసనలాగానే. ప్రతిరూపోపాసన:— సర్వతః పాణిపాదం తత్ సర్వతోక్షి శిరోముఖమ్, సర్వాత్మయైన మాధవునికి అంతటా చేతులూ, కళ్లూ; చూస్తాడు, ఆలోచిస్తాడు, తింటాడు, వింటాడు. సర్వోన్నత ఆదర్శ భావముతో ప్రతిరూపోపాసన జరుగుతూ వుంటుంది.

భానోపాసన—మంచి గుణములన్నింటినీ మాధవునిలో అమితంగా వుండినట్లు చూడటమే.

గీతోపాసన—భారతం పంచమ వేదం. అది ఐహిక ఆముష్మిక ధర్మాలనిధి. మాధవుడు భారత దేశ ధర్మక్షేత్రరంగస్థలంలో తన నాటక సామ గ్రిని దింపుకొని ఆడిన అద్భుతమైన ఆట, మహా భారతము. భారతనాటకానికి పాత్రధారులును, మాటలను, పాటలను, సమకూర్చిన రచయిత, నటకుడు, దర్శకుడు, నిర్మాత అంతా వక్క మాధవుడే. వకవైపున అధర్మవృద్ధమైన అపార భౌతిక బలం, మరొకవైపున ధర్మ వృద్ధమైన పరిమిత ఆత్మబలం. ఈ రెంటి ఘర్షణలో పర్యవసాన రూపమైన ధార్మిక విజయ జ్యోతిగా తనను నిర్దేశించుట, ఇదే. భారతామృత సర్వస్వం అదే భగవద్గీత. మహాభారత సారాంశమంతయూ భగవద్గీతలో ఉన్నది. "కరిష్యే వచనం తవ" నీవు చెప్పినట్లే చేస్తాను, "స్వధర్మే నిధనం శ్రేయః" ఇదే ఐహిక తత్వానికి గీటురాయి. సర్వ శ్రేయస్సులను ప్రవహించే భక్తిని నిర్లక్ష్యము చేసి కళ్లు మూసుకొని అహం బ్రహ్మాస్మి అనే అహంకారముతో బాధపడే నకిలీ బ్రాహ్మలకు క్లేశమే ఫలితము. పొట్టుదంచితే బియ్యము రాదు కదా! అసలుబ్రహ్మమే కృష్ణుడు.

"అద్వైతోపాసన" ఆదిశంకరులు—ఆవు శరీర ములో పాలు ఉన్నాయి. ఆ పాలలో నెయ్యి ఉన్నది. అయినా ఆ నెయ్యితో ఆవుకు బలము రాదు. ఆ పాలను పితికి, కాచి,తోడుపెట్టి చిలికి వెన్న తీసి, కాచి, ఆ నెయ్యినే మళ్ళీ ఆవుకు త్రాపించిన బలము కలుగుతుంది. అలాగే సర్వే శ్వరుడు సర్వాంతర్యామి అయినా సాధనోపచార ములు లేకుండా, మానవులలో హితం చేయ జాలడు. నువ్వులలో నూనె, పెరుగులో వెన్న, భూమిలో నీరు, కట్టెలో నిప్పు, కలసి వుండున టుల సర్వాంతర్యామి మానవుల శరీరములలోను మనసులలోను కలిసి వున్నాడు. వాటిని వేరు చేయాలంటే ప్రయత్నం, సాధన చేయాలి అపుడు ఆరెంటి అభేదత్వం, అద్వైతం తెలుస్తుంది. అదే మోక్షం.

ః- –రామానుజుడుః ఉపాసించదగిన పరమాత్మను తనకు వేరుగా వున్నట్లు భావిం చాలా లేక తనలో కలిసి వుండినట్లు భావించాలా సాధకునిది ప్రశ్న.

ఇక జవాబు:-జీవుడు శరీరానికి ఆత్మ. అలాగే దేవుడు జీవునకు ఆత్మ. అలా భావించి ఉపాసించుటే, రామానుజాచార్యుల విశిష్టాద్వైతోపాసన. ఈ సమస్తభూతజాలము ఎవని లో వున్నాయో యెవరు ఈ సమస్తానికి అంతర్యామిగా వ్యాపించి యున్నారో ఆ పరమపురుషపరమాత్మ అనన్య భక్తి (ప్రపత్తి)తోనే లభ్యమవుతారు అని పరజ్ఞాన ప్రపత్తిపూర్వకంగా పరమ పురుషోపాసన చేయటమే విశిష్టాద్వైతం. "త్వమేవ సర్వం మమ దేవదేవ", నీవే నాగతి, పతి అనే అనన్యభావంతో ఉపాసించుటే.

ద్వైతోపాసన:—మధ్వాచార్యులు— పతిపత్ని సంబంధమే జీవాత్మ పరమాత్మ సంబంధంకూడా. అవ్యయుడైన విష్ణుభగవానుని భర్తగా ద్వైతభావముతో ఉపాసించుట.

చైతన్యోపాసన :— శ్రీకృష్ణ చరణాసక్తి భక్తి లేనిదే జీవన్ముక్తిమాట అటుంచి కనీసం బుద్ధి శుద్ధంకావటం కూడా అసంభవము. అని అంటాడు చైతన్యుడు. మునులూ, ఆత్మారాములు అయినవారికి లౌకిక గ్రంథాలు లేకపోయినా సూదంటు రాయిలాంటి శ్రీహరి కల్యాణ గుణగణ విశేషం వల్లా నిష్కారణంవల్లా భక్తపారవశ్యం వారికి కలుగుతూ వుంటుందట. ఆ పారవశ్యముతో సిగ్గూ, బిడియాలు వదలి, బిగ్గరగా శ్రీహరి నామ సంకీర్తనం చేస్తూ, గగుర్పాటుతో కంటిధారలతో నృత్యంచేస్తూ అసలైన ఆనందాన్ని అనుభవిస్తూ వుంటారు. శ్రీచరణులు ఈ విశ్వాన్ని పావనం చేస్తూ వుంటారు, ఈ విధంగా, పరానురక్తితో నామసంకీర్తన ప్రధానంగా కలిగింది. చైతన్యుల ఉపాసన, నామసంకీర్తనలలో, తన్మయత్వంతో నృత్యము చేస్తూ తాదాత్మ్యభావముతో నిలిచి వుండుట ప్రధానలక్ష్యము.

(సశేషము)

# విద్యాదానం

సత్ప్రవర్తన, సద్బుద్ధి, సత్యనిరతి
భక్తి, క్రమశిక్ష కర్తవ్యపాలనములు
నేర్పునదె గురువు.... విద్యార్థి నేర్వవలయు॥

లారా,

ఏ దేశములో కాని, ఏ కాలములో కాని విద్యా విధానమునకు రెండే పరమావధులు. ఒకటి ఐహికము రెండవది ఆముష్మికము. మొదటి దానిని జీవిత-జీవ నోపాధి అంటారు. రెండవ దానిని జీవన పరమా వధి అంటారు. ఈ ఐహికము అనేటువంటి దానిని మనము నిత్యజీవితములో అనుభవిస్తూనే వుంటున్నా ము. ఈ ప్రపంచములో, ఈ సమాజములో మాన వుడు బ్రతికి వున్నంత కాలము కూటి గుడ్డలకు కొరత లేక జీవింప చేయునదే ఈ ఐహికవిద్య. ఇక ఆము ష్మిక మనగా దానికి భిన్నమయినటువంటిది. అతీత మయిన ఆత్మస్థాయిలో విహరించేటటువంటిది ఆముష్మి కవిద్య. జ్ఞానము అనగా తెలివి అని అర్థము. అయితే, ఈ తెలివికి వ్యాపక లక్షణమే విద్య. 'సా విద్యా యా విముక్తయే' అనగా ఏది మనలను దుఃఖమునుండి దూరము చేయునో, మృత్యువును తప్పించునో అదియే సరిఅయిన విద్య. కనుక మానవుని దుఃఖమునుండి దూరము చేయునది ఆముష్మిక విద్యగా మనము విశ్వ సించాలి. ప్రతి మానవుడు తన జీవితములో కోరేటు వంటి కోరికలు రెండే. దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తి జీవితమంతయు ఈ రెండింటియందె ఇమిడియున్నది. కనుక దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తి నిమిత్తమయి అభ్యసించేటటువంటిదే ఈ ఆముష్మిక విద్య అనే సత్యాన్ని మనము పిల్లల హృదయమునకు హత్తుకునే విధముగా బోధించాలి. ఇది జ్ఞానం, జ్ఞేయం, జ్ఞాన లక్ష్యం—ఈ మూడింటియొక్క ఏకత్వంతో కూడినటు వంటిది. ఈ మూడింటికినీ జ్ఞాన భాస్కరుడయిన మాధవుడే కర్త. అయితే దీనికి శ్రద్ధ అత్యవసరము. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం'. శ్రద్ధ వున్నవారికే ఇట్టి జ్ఞానము లభిస్తుంది. ఈ శ్రద్ధ ఏవిధంగా లభిస్తుంది? దశేంద్రియములను అదుపులో వుంచిన వారికి మాత్రమే ఆత్మవిశ్వాసముద్వారా ఈ విద్య లభించే అవకాశం వుంది. కనుకనే ఈ దశేంద్రియములను అదుపులో వుంచే విధానాన్ని మనము మొదట ఈ లేతప్రాయము నందే పిల్లలకు బోధించటానికి పూనుకోవాలి. ఈ జ్ఞానము అనగా నేమి? మానవుడు మాధవుడుగా మార టమే జ్ఞానముయొక్క గమ్యము. కనుక జ్ఞానగమ్యము మాధవత్వమే: మాధవుడు—దీని అంతరార్థాన్ని మనము చక్కగా గుర్తించాలి. మా—అనగా ప్రకృతి. ప్రకృ తిని వశమునందుంచుకునేవాడు అనగా, దానిని నియ మించే భర్తనే 'ధవుడు'. ప్రకృతిని అదుపులో వుంచు కుని, దానిని తన ఇష్టానుసారముగా ప్రవర్తింపచేసే శక్తిసామర్థ్యములు కలవాడు మాధవుడు. పుట్టి, మెట్టి, గిట్టుటకు కారణము మాధవుడు. కనుక యావత్ జీవులయొక్క సృష్టి, స్థితి, లయములు ఒక్క మాధ వత్వమునందే వెలువడుతున్నవి; దైవత్వమనగా సృష్టి, స్థితి, లయములకు మూలాధారమయినటువంటిది అని చెప్పాలి.

నీటియందె పుట్టి నీటియందె నిలచి
నీటియందడగు నీటి బుడగ
నరుడు బుద్బుదము, నారాయణుడు నీరు।

కనుక ప్రతి జీవియును నారాయణుడను జలమునందే ఆవిర్భవించినది, జన్మము, ధన్యము, గమ్యము అన్నీ కూడను ఒక్క లక్ష్యమునుండే వెలువడినటువంటివి. కనుక సర్వాధారుడైన సర్వేశ్వరుని గుర్తింపజేయునదే ఆముష్మికవిద్య. కాని నేటి ఆధునిక యుగమునందు అనేకమంది పెద్దలు రాజకీయవేత్తలు, ఆధ్యాత్మిక ప్రబోధకులు అనేక విధములుగా లోకములో ప్రచార ప్రబోధలను సలుపుతూ వస్తున్నారు. కట్టుటకు బట్ట, తినుటకు తిండి, నివసించుటకు ఇల్లు, రోగమొస్తే నివారణకు మందు, పొట్టను పోషించుటకు అంతో ఇంతో విద్య వుంటే, మానవుడు సుఖశాంతులు అనుభవిస్తాడు అనేటటువంటి బలహీనతావిశ్వాసము మానవుని యందు అభివృద్ధి అవుతోంది, కాని భౌతిక సౌఖ్యములు మానవునికి సుఖశాంతులను అందించలేవని గుర్తించటము లేదు. సుఖశాంతులు ఆత్మస్థాయినుండి లభించేటటువంటివే కాని అన్యవస్తువులనుండి లభించేటటువంటివి కావు; భౌతిక సదుపాయములు కలవారు చాలామంది వున్నారు. కాని వారు నిజముగా సుఖశాంతులు అనుభవిస్తున్నారా? లేదు. భౌతిక సౌఖ్యములు కేవలము ఐహిక సుఖములను చేకూర్చునవే కాని ఆముష్మికమైన ఆనందాన్ని అందించలేవు. అయితే మానవుడు అనగా ఎవరు? కేవలము రక్త మాంసములు, ఎముకలు, చర్మముతో కూడినటువంటి వాడా? అట్లేఅయిన, కేవలము భౌతిక సదుపాయముల తోనే సంతృప్తిని, శాంతిని పొంది వుండేటటువంటి వాడు. కాని మానవుడు కేవలం రక్తమాంసములతో కూడినటువంటి వాడేకాదు, ఇది కేవలం భౌతిక స్వరూపం. ఇది స్థూలమయిన రూపం. దీనికి సూక్ష్మమయిన మనస్సు, దానికి అతీతమయిన కారణమను ఆత్మ వున్నాయి. మానవుడు స్థూల, సూక్ష్మ కారణ శరీరములు కలవాడు. భౌతిక సుఖములతో జీవించేది స్థూల శరీరమేకాని, సూక్ష్మ, కారణ శరీరములు కావు. మనము ఎక్కువ భాగమయిన సూక్ష్మ, కారణ శరీరాన్ని మరచిపోతున్నాము. కనుక సుఖ శాంతులను సమకూర్చేటటువంటివి సూక్ష్మ, కారణశరీరంచే అన్న సత్యాన్ని పిల్లలకు చక్కగా బోధించాలి. అందుకనే వేదాంత పరిభాషయందు 'మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః' అని అన్నారు. బంధములకు. మోక్షమునకు మనస్సే కారణము కాని దేహము కాదు. ప్రతి మానవుడు కూడను మానసిక శాంతికై తపిస్తున్నాడు. మానవుడు సుఖ శాంతుల నిమిత్తమయి ఈ దేహముతో, పవిత్రభావములతో కొన్ని సత్కర్మలను ఆచరించటానికి పూనుకోవాలి. మానవుడు సుఖాభిలాషి, ఆనందపిపాసి. ఈ రెండుఅయిన మానవుడు తన సుఖము, ఆనందము ఎక్కడనుండి లభిస్తుంది అనే విచారణ సలుపకుండా కేవలం భౌతిక లౌకిక సుఖములనే మార్గములో ప్రవేశించటముచేత, తన నిజ సుఖాన్ని కోల్పోతున్నాడు. నిజముగా ఆనందం ఎక్కడనుండి వస్తుంది? బయటనుండి వస్తుందా? కాదు. ఆనందము మనకు సహజము. అది మన స్వభావము. చక్కెరకు తీపి ఎలా సహజమో, పుష్పమునకు సువాసన ఎలా సహజమో, మానవునకు ఆనందము అలా సహజము. కనుకనే మనము ఏదైనా ఒక బజారునందు పోవునపుడు మార్గమునందు ఒక వ్యక్తి గోడుగోడున ఏడ్చుచుండగా 'అయ్యా మీరు ఎందుకు అట్లా ఏడ్చుచున్నారు' అని అడుగుతాము. ఈ విధముగా ప్రశ్నించటములో అంతరార్థమేమి? ఆనందించవలసిన మానవుడు ఏడుస్తున్నాడు. ఈ ఏడుపుకు కారణమేమి? ఏడుపు అసహజము. అదే ఎవరైనా

ఆనందముగా వున్నప్పుడు వారిని 'మీరు ఎందుకు విచారముగా లేరు' అని అడగము. కారణము, ఆనందము సహజ లక్షణము. ఈ కాలములో మన సహజమయిన ఆనందాన్ని మరచేటటువంటి విద్య మనము అభివృద్ధి పరచుకుంటున్నాము. ఆనందమయిన ఆత్మతత్వాన్ని అంతర్ముఖంగా విచారణ సలిపేటటువంటి శక్తిని మనము అలవరచుకోవటము లేదు. మన దృష్టిని మనం అంతర్ముఖం చేసుకుని, విచారణశక్తికి తగిన అవకాశం అందించాలి. ఈ నాటి విద్యలన్నీ ఏ రకంగా వున్న వనగా, ఉన్న సమయమంతా గ్రంథములు చదవటానికే వినియోగిస్తున్నాము. ఇవి చదివి, చదివి confusion అయిపోతోంది. నిజముగా విద్యను శ్రవణముద్వారానే నేర్వాలి. గ్రంథముద్వారా విద్య నేర్పకూడదు. గ్రంథంద్వారా విద్య నేర్చుకునే విద్యార్థులకు ఏకాగ్రత తక్కువ అయిపోతుంది. ఇంటికిపోయి text book చూసుకోవచ్చు కదా అని విద్యార్థులు teacher చెప్పే విషయాన్ని కొంత అలక్ష్యముగా వింటారు. Texts, notes వుండటంచేత students వారి ఏకాగ్రతను దుర్వినియోగం చేస్తున్నారు. ప్రాచీన కాలమందు ఈ Printed books, notes వుండేటటువంటివి కావు. గురు శిష్యులు ముఖాముఖిగా కూర్చుని విద్య నభ్యసించేవారు. ఆ శిష్యులుకూడను 5 లేక 6గురు మాత్రమే వుండేవారు. శిష్యులు ఏకాగ్రతతో గురువు చెప్పే విషయాన్ని హృదయానికి హత్తుకునే విధంగా అందుకునే వారు. శిష్యులు తక్కువగా వుండటంచేత, గురువు ఏ శిష్యుడు వింటున్నాడో ఎవరు వినటం లేదో గ్రహించటానికి అవకాశం వుండేది. గ్రంథముచేత విద్య నేర్చుకునేవారు ఏ ఒక్కరో ఇద్దరో వుండేవారు. ఎక్కువమంది శ్రవణంద్వారానే నేర్చుకునేవారు. కనుకనే నవవిధ భక్తి మార్గములలో శ్రవణమునకు మొదటి స్థానం ఇచ్చారు. ఈ విధమయిన విద్యా బోధనలో గురువుకు కూడా తాను చెప్పబోయే విషయం కంఠస్థముగా వచ్చి వుండాలి. ఇది హృదయమునుండి హృదయమునకు అందించే విద్య.

భగవంతుడు అవ్యక్తంగా మనలో వుంటుంటాడు. ఈ అవ్యక్తమయిన దానిని వ్యక్తంచేయటానికి సాధన అవసరం. అగ్గిపుల్ల పెట్టెలో వున్నంతకాలం దానిలోని అగ్ని అవ్యక్తంగా వుంటుంది. దానిని బయటకు తీసి గీచినపుడు మంట వస్తుంది. అనగా ఈ గీయటం అనే చర్యద్వారా పుల్లలో అవ్యక్తంగా వున్న అగ్నిని వ్యక్తం కావించాము. అదే విధముగానే, మనలో జ్ఞానమనే అగ్ని అవ్యక్తంగా వుంది. దీనిని వ్యక్తం కావించటానికి జపము, ధ్యానము, భజన, మొదలయిన సాధనలద్వారా దానిని వ్యక్తం చేయటానికి ప్రయత్నించాలి. లోకములో మనము ఏ పదార్థాన్ని కోరినా దానియందు ఒక ప్రేమ వుంటుంది. ప్రేమ వుండినపుడే దానిని కోరుకుంటాము. ఆ ప్రేమ మాత్రమే కాక దాని విశిష్టతయందు విశ్వాసం కూడా మనలో వుండాలి. ఈ రెండు వుండినంత మాత్రమున ఆ వస్తువు మనకు చిక్కదు. ఆ వస్తువును పొందేటటువంటి కర్మను ఆచరించాలి. దానిని పొందేటందుకు ఆచరించే విధి విధానమే కర్మమార్గము. దానిని ప్రేమించటమే భక్తి మార్గము. దానిని విశ్వసించటమే జ్ఞాన మార్గము. కనుక మనము ఏదైనా ఒక దానిని పొందాలనుకున్నప్పుడు అందులో కర్మ, భక్తి, జ్ఞాన మార్గములు సమ్మిళితములై వుంటున్నాయి. అనేకమంది భక్తి అంటే గిట్టనివారు వుంటుంటారు. నిజముగా భక్తి అంటే తెలియని మూర్ఖులే ఇటువంటి వారు అని చెప్పవచ్చు. భక్తి అంటే ఏమిటి? ప్రేమ. నాకు అన్నము కావాలి. అన్నాన్ని ప్రేమిస్తున్నాను. అది అన్నముపైన భక్తి. తింటేకాని ఆకలి తీరదు

అన్న విశ్వాసము జ్ఞానము. దానిని పొందటానికి చేసే ప్రయత్నము కర్మమార్గము. ఇది అన్నము నిమిత్తమయి ఆచరించే కర్మ. భక్తి జ్ఞాన మార్గములు ఆదే విధముగానే ఆత్మ నిమిత్తమయి ఆచరించే కర్మ. భక్తి. జ్ఞాన మార్గములు కావాలి. అన్నము దేహనిమిత్తము. ఆనందము మనస్సు నిమిత్తము. జ్ఞానము ఆత్మనిమిత్తము. కనుకనే ఈ మూడు ఆహారములను పొందటానికి కర్మ. భక్తి. జ్ఞాన మార్గములను అనుసరించాలి. అందుకనే నేను అనేక పర్యాయములు చెప్తూంటాను. You are not one Person but you are three Persons. The one you think you are - that is body–అన్నగతప్రాణ The one others think you are - that is mind–మనోగతప్రాణ The one you really are - that is Atma–ఆత్మగతప్రాణ. ఈ మూడు ప్రాణములను మనము ముమ్మూర్తులుగా భావించి దానికి తగినటువంటి విద్యా విధానాన్ని అనుసరించాలి. ధనముతోను, విద్యతోను, భౌతిక సుఖములను అనుభవించవచ్చును. కాని అవి తాత్కాలికము, శాశ్వతము కాదు. 'నాకు ఇప్పుడు ఆకలిగా వుంది. నేను అన్నము కోరుతున్నాను. అన్నము చిక్కింది తృప్తి అయింది.' ఎంత కాలము? తిరిగి ఒక 2 గం. వరకు. తిరిగి ఆకలి. అన్నం కావాలి. భౌతికమయిన తృప్తి అంతా 'పునరపి జననం. పునరపి మరణం' వంటిది. కాని మానసిక శాంతి లభించెనా అది ఎప్పుడు మనము స్మరించినా ఆ సంతృప్తిని అందిస్తుంది. కనుక మానసిక శాంతిని అందించగల విద్యను అభ్యసించాలి. మానసిక శాంతికి మాధవత్వాన్ని గుర్తించాలి. ఏకాత్మ భావాన్ని గుర్తించడానికి ప్రయత్నించాలి. ఏకాత్మ భావం ఒకటిగా వుంటుంది. దేహాత్మ భావం అనేకంగా వుంటుంది.

ఉపనిషత్‌లలో తత్, త్వం లకు సమన్వయము వివరించబడింది. తత్ ఏది? త్వం ఏది? ఈ రెండింటినీ కలిపేది ఏది? Answer చెప్పేది 'తత్' Question వేసేది 'త్వం'. ఈ రెంటినీ కలిపేది 'అసి'. కనుక తత్త్వమసి. ఇది ఉపనిషత్తు. ఉప అనగా 'దగ్గిర', 'ని' అనగా 'క్రింద', 'షత్' అనగా 'కూర్చో'. అనగా శిష్యుడు గురువునకు దగ్గరగా క్రింద కూర్చొని విద్య నభ్యసించాలి. క్రిందనుండి శిష్యుడు ప్రశ్నిస్తాడు. పైనుండి గురువు జవాబు చెప్తాడు. Answer చెప్పిన తరువాత గురు శిష్యులు ఏకమయి పోతారు. ఉపనిషత్తులు జీవాత్మ. పరమాత్మల సంబంధాన్ని తెలుపుతుంది. శిష్యుడు లేక జీవుడు తత్త్వమసి అనేస్థాయినుండి 'అహం బ్రహ్మాస్మి' అనే స్థాయికి చేరతాడు. Who is Brahma? బ్రహ్మ ఎవరు అనే ప్రశ్నకు 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనే answer లభిస్తుంది. దీనినే 'అయం ఆత్మబ్రహ్మ' అని చెప్పవచ్చు. అనగా 'అయం ఆత్మా అయం బ్రహ్మ' (I amAtma, I am Brahma).

కనుక పిల్లలకు నేర్పేటప్పుడు ముందుగా వారు క్రింద కూర్చుని నేర్చుకునే విధంగా నేర్పాలి. పిల్లలను ప్రేమించవలసినదే, కాని వారిని వారి స్థాయిలో వుంచాలి. కాని మన స్థాయిలో వుంచరాదు. గురుశిష్య సంబంధము వున్నప్పుడే విద్యాబోధన సాధ్యం. ఉద్దాలకుడు మహాజ్ఞాని. తన కుమారుడయిన శ్వేతకేతును విశ్వామిత్రునివద్దకు విద్య నేర్చుకునేటందుకు పంపించాడు. కారణం ఏమిటి? తనకు విద్య లేదా? ఎంత నేర్పినప్పటికినీ, తనకు, తన కుమారునికి మధ్య తండ్రి కుమారుల భావమే వస్తుంది. కాని గురు శిష్య భావము రాదు. గురుభావము వుంటేనే శిష్యునికి విద్య ప్రాప్తిస్తుంది. కనుక పిల్లలను ప్రేమించి లాలించాలి. కాని కొన్ని సమయములలో శిక్షించవలసి వచ్చినప్పుడు

శిక్షించాలి. శిక్ష లేకపోతే రక్షణలేదు. ఈ కాలంలో ఇటువంటి శిక్ష లేదు కాబట్టి విద్యార్థుల విద్య వ్యర్థం అయిపోతుంది. అయితే శిక్షకూడా క్రమంగా వుండాలి. అప్పుడే క్రమశిక్షణ అవుతుంది. గురువు కదా అని శిక్ష మరీ కఠినముగా వుండకూడదు.

విద్యాబోధకులు ఈ విషయములు మనసునందు వుంచుకుంటే, మన భావిభారత విద్యార్థులు మన దేశానికే కాక, ఇతర దేశములకు కూడా ఉపయోగకరముగా వుంటారు. ముఖ్యంగా పిల్లలకు భారతీయ సంస్కృతి గురించి వివరించాలి. ఎంతోమంది ఋషులు, ప్రభువులు, పతివ్రతలు, త్యాగంచేసి మన భారతీయ సంస్కృతిని నిలబెట్టారు. కనుకనే ఈనాటి పరిస్థితులలో కూడను నిజాయితీతో జీవించటానికి వీలవుతోంది. పిల్లలకు ముఖ్యంగా నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక విషయాలను నేర్పాలి. వీటితోబాటు అన్ని మతములపట్ల సమభావము, గౌరవభావము పెంపొందించాలి. అన్ని మతములు బోధించేది ఒక సత్యమే. అన్ని మతములు ఒకే ధర్మాన్ని ఒకే గమ్యాన్ని బోధిస్తున్నాయి. కనుక బాలవికాస్ పిల్లలు ఏమతముపట్ల కూడ వ్యతిరేక భావములు కలిగి వుండరాదు.

మొదట, నీతి వాక్యములు, నీతి మార్గములు, పవిత్రధర్మములు బోధించే రామాయణ, భారత, ఖురాను, బైబిలు మొదలగు పవిత్ర గ్రంథములలోని సూక్తులను పిల్లలకు బోధించాలి. ఇంక మనము కూడా మంచి నడవడికను కలిగి వుండాలి. వారికి బోధించి మనము ఆచరించకుండా వుండరాదు. మనము ఇక్కడ ఎంత బోధించినప్పటికీ, ఇంటిలోని వాతావరణము సరిగ లేని యెడల మన బోధన అంతా వ్యర్థమయిపోతుంది. కనుక పిల్లల తల్లిదండ్రులను కూడా కలసి, వారు ఇంట్లో పిల్లలకు ఎటువంటి training యివ్వాలి అనికూడా మనము వారికి చక్కగా బోధించాలి. అసలు తల్లితండ్రుల వలననే పిల్లలు కొంతవరకూ చెడిపోతున్నారు. అతి గారాబముచేత పిల్లలు పాడయిపోతారు మన ప్రేమను మనము అదుపులో వుంచుకోవాలి వారికి. అవసరమయినదానికన్న ఎక్కువ డబ్బు ఇవ్వరాదు. పిల్లలు ఆదర్శవంతముగా తయారవాలంటే ఒక ప్రక్క తల్లిదండ్రులు, ఒకప్రక్క teachers బాధ్యులు.

భారతదేశపు భవిష్యత్తు అంతా బాలవికాస్ పిల్లలపైన ఆధారపడివుంది. ఈనాటి బాలవికాస్ విద్యార్థులు రేపు మా College విద్యార్థులు. ఇది ప్రాథమిక విద్య. ఇది foundation. వారి భవిష్యత్తు దీనిమీద ఆధారపడి వుంది. ఇక్కడ అలక్ష్యం జరిగితే మొత్తం భవనం కూలిపోతుంది. వారి జీవిత భవనానికి ఇది foundation. కనుక మీరు మంచివారుగా వుండాలి. మీరు చేసే సేవ దేశసేవ సంఘసేవ, దైవసేవ విశ్వసేవగా భావించుకోవాలి. సర్వసేవలు కూడనూ ఈఉపాధ్యాయ స్థానములో వున్నాయి. ఉపాధ్యాయునిది చాలా గొప్ప స్థానం. విద్యాదానం అన్ని దానాలలో గొప్పది. మీరు దేశాన్నితీర్చి దిద్దే శిల్పులు విద్యార్థులనే శిలలను తీర్చి దిద్దవలసిన బాధ్యత మీపై వున్నది. మీరు కొంచెం శ్రమపడితే దేశానికే సేవ చేసినవారవుతారు. మన ఈ లక్ష్యాన్ని స్వార్థరహితంగా సేవచేసి సాధించాలి. వారిని మీ బిడ్డలుగా భావించి, పిల్లలను చక్కగా తీర్చి దిద్దుతారని నేను ఆశిస్తూన్నాను. మీకున్న సమస్యలుకాని, ప్రశ్నలు కాని, సందేహాలు కాని నాకు చెప్తే, వాటికి సమాధానాలు చెప్తాను. కనుక మీరు కాలమును వృధా చేయకుండా మీ బాధ్యతను సక్రమంగా నిర్వర్తిస్తూ, ఇంకా ఇతర ఉపాధ్యాయుల కందరికినీ ఈ విషయాలనందించి, అవసరమయిన సలహాలు, ప్రోత్సాహాలు ఉత్సాహాలు అందిస్తారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ, నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

శ్రీవారి దివ్యబోధ

# "అనిత్యమసుఖంలోకం"

దృశ్యమానమగు యీలోకము అనిత్యమనియు, సుఖవర్జితమనియు గీతాచార్యుడు వక్కాణించెను. మనుజుడు సర్వదా సుఖప్రాప్తిని, దుఃఖనివృత్తిని కాంక్షించుచున్నాడు. నిజమునకు దుఃఖ సమ్మిశ్రితము కాని సుఖమే, వాస్తవసుఖము. అట్టివి నిర్మల సుఖము మానవునికి యీ పాంచభౌతిక జగత్తున లభించగలదా? అది దుర్లభమని శ్రీకృష్ణపరమాత్మ స్పష్టీకరించెను. అట్టియెడ దుఃఖ లేశములేని సత్యసుఖముకొరకు యీ దృశ్య పదార్థములను గాలించుట వివేకరహిత వ్యర్థ ప్రయత్నమే కాగలదు.

అయినను శ్రీకృష్ణుడు జీవితమున నిరాశాదృక్పథమును ప్రోత్సహించుటలేదు. ఆనందప్రాప్తికి సత్య పథమును తదుపరి సూచించుచున్నారు. అయితే కేవలము ఐహిక వ్యవహారములు నడపుచు తమ జీవన యాత్రను సాగించు మనుజులు ఏదోకొంత సుఖానుభవమును బొందుతున్నట్లు కనపడుచున్నది గదా! అది ఎట్లు?

యదార్థముగ వారనుభవించు సౌఖ్యము భ్రాంతిజన్యము, క్షణికము, విషయభోగము సుఖాభాసమేగాని నిత్య, సత్య, నిశ్చలానందము కానేరదు. 'విషయరతి' ప్రతిబింబానందము నిచ్చునేగాని 'ఆత్మరతి' వలె అది సహజమగు అక్షయా నందమును ప్రసాదించలేదు. క్షుత్పిపాసాది దేహతాపోపశమనమును బొందిన మనుజుడు సంతుష్టాంతరంగుడై శాంతిని బడయును. ఇట్లే మాయామోహితుడైన మానవుడు తానుపెంచుకొన్న కోరికలు సిద్ధించినపుడు సుఖసమృద్ధిని బడసినటుల భ్రమించును. ఈవిధమున శరీరసంబంధమగు కొన్ని బాధలు తొలగి మనోకల్పితములైన కొన్నివాంఛలు తీరినపుడు సుఖానుభూతి లభించు చందమున లోక వ్యవహారమున సర్వత్ర కనపడుచున్నది. కాని మనము భ్రమించు యీ సుఖలేశము బాహ్యవిషయములపై పూర్ణముగ ఆధారపడి ఫలించుచున్నదేగాని స్వతంత్రముగ మనకు లభించుటలేదు.

అందువలన దీనిని పరతంత్ర సుఖమనవచ్చును. ఈ పరాధీన సుఖము నిత్యముగను, నిశ్చలముగను మన జాలదు కారణమేమన దీనికి ఆధారభూతమైన బాహ్య వస్తు సంచయము స్వభావసిద్ధముగ అనిత్యములు, ఆపాత రమణీయములు. అవి వచ్చుచు పోవు స్వభావము గలవి (ఆగమా పాయినః)

ఇచ్చట మరొక ముఖ్యాంశమును గమనించుట అవసరము. ఒకేవస్తువు అందరికిని సమాన సంతుష్టి నిచ్చుటలేదు. కొందరికది అహితమును కలిగించుచుండుట కూడా కాన్పించుచున్నది. పైపెచ్చు ఒకే వ్యక్తి ఒక విషయమును అనుభవించుచు పోగా అది మొదట నీయగల సుఖమును కాలక్రమమున ఇచ్చుటయులేదు. వాస్తవముగ ఇంద్రియార్థములందు (విషయములందు) సుఖప్రాప్తిని కలిగించు స్వతసిద్ధం లక్షణమే యున్నచో అవి అందరికిని అన్నివేళల నిశ్చలానందమును చవిచూపవలెను. కాని ఈవిధమగు వసు

తత్త్వము లోకమున దుర్లభమని నిస్సంశయముగ జెప్ప నొప్పును.

విషయ భోగానుభవము యిట్లనిశ్చితమైయుండగ వాంఛిత వస్తుసంపద లభించనివేళ దుఃఖానుభవము గూడ అనుభవైకవేద్యమే. ఈ విధముగా ప్రాపంచిక సుఖ దుఃఖానుభవములు రెండును విషయగతమైన సహజస్వభావ ప్రేరణమున జనించుట లేదని గ్రహించనగును. ఈ సుఖదుఃఖరూప దురవస్థకు మనోకల్పితములగు వాంఛలే మూలకారణము. "కోరిక ఉదయించినపుడే కోరదగిన ప్రవృత్తి వస్తువునందు కన్పట్టును" అని స్వామివారు విషయ వ్యామోహ రహస్యమును బయల్పరచిరి. కోరికల ప్రాదుర్భావమునకుగల మూలకారణమును గీతావాణి అతి సరళముగ వివరించినది. "ధ్యాయతో విషయాన్ పుంసః సంఙ్గస్తేషూపజాయతే; సఙ్గాత్సంజాయతేకామః ;" మనుజుడు శబ్దాది విషయములను చింతించుచుండుట వలన అవిషయములందాసక్తి జనించుచున్నది. అట్టియాసక్తిచే దానియందతనికి కోరిక ఉదయించు చున్నది. అనగా విషయ ధ్యానముచేసి స్వయముగ మనమే జగద్విషయములందు అనుచితమైన కోరికలు పెంచుకొనుచున్నాము గాని తద్విషయములే మనలో కోరికలను ప్రకోపింప జేయుటలేదని దీనిభావము.

ఇందు దృష్టిలోపమేగాని సృష్టిలోపమేమాత్రమును లేదు. విషయ వాంఛలు స్వయంకృతాపరాధ ఫలితము లేగాని మరితరములుగావు. విషయానందము కూడ స్వకల్పితమే. విషయచింతనలో కోరిక జనించగనే దానిసిద్ధికిగాను ఆవేదన, అశాంతి మనసున రగుల్కొనును. కోరిక ఫలించినచో స్వకల్పితమైన అశాంతి ఆవేదన తొలగి కోరిక ఉదయించుటకు పూర్వమునగల సహజ సుఖమును, శాంతిని బడయుదుము. అది ఫలించనిచో కలతజెంది స్వకల్పిత దుఃఖమునుకూడ అనుభవింతుము. రెండును స్వకల్పితములే. ఇదియే విషయానుభవములోని అంతర్లీన సత్యము.

ఈ దేహమును ఒకవ్రణముగాను, మనము ధరించు దుస్తులను 'బ్యాండేజి' గాను, మనమారగించు ఆహార పానీయములు ఔషధములుగాను భావించవలెనని సాయి సద్గురునాథుడు దేహతత్త్వమును అర్థవంతముగ ప్రబోధించిరి. వ్యాధి నివారణకొరకు ఔషధములవలె దేహపోషణ కొరకు ఆహారపానీయములు అవశ్యములు. కాని అవిభోగ్యవస్తువులు కాజాలవు. సత్యసుఖవస్తువు ఆత్మయొక్కటియే, అది స్వయంసమృద్ధ ఆనందసాగరము. మిగిలినదంతయు జడము, సారహీనము. విషయానుభవ నైజమును విపులీకరిస్తూ శ్రీరామకృష్ణ పరమహంస ఒకచక్కని ఉపమానము దెలిపిరి. ఆకలిగొన్న ఒక శునకము ఎండి విస్పారమైన ఒక ఎముకను కనుగొని దానినిబలముగ నాకుట ప్రారంభించెను. కొంతసేపటికి పదునైన ఆఎముకకొన రాచుకొని దాని నాలుకతెగి ఎముకముక్క రక్తసిక్తమయ్యెను. ఆ రక్తము ఎముకనుండి లభించుచున్నదను భ్రమతో శునకము తనరక్తముతానే ఆరగించి తనివినొందెను. మనము స్వయముగ అమృతపుత్రులము. మనయందునసహజసిద్ధముగానున్న యట్టి అమృతపానము కొరకు విస్పారమైన బాహ్యవిషయ లంపటలో మునిగి తేలుతు మనయొక్క సహజానంద స్వభావమును అజ్ఞానమాలిన్యవశమున లౌకికవిషయములకు అపాదించు కొనుచున్నాము. కనుక లోకసంబంధమగు విషయచింతను దూరీకరించుటయే దివ్యానందమునకు సరియైన మార్గము "త్యాగేనైకే అమృతత్వమానశుః" అని సనాతనధర్మము ఉపదేశించు చున్నది. విషయతృష్ణ చల్లారనిదే కృష్ణ తృష్ణ ఉదయించదు. భగవత్పరితాపము కలుగనిదే బ్రహ్మజ్ఞానామృతము లభించదు.

"దృశ్యకల్పితమైన జగత్తు మానవునికి క్షణకాల సుఖమును అందించుచున్నది. జగత్తునందున్న ప్రతిపదార్థమునందు కూడ అనిత్యమను దోషము అంతర్భూతమై యుంటున్నది. అంతియేకాదు నిరంతరము మార్పు చెందే రోగముకూడ యీపదార్థము నందుంటున్నది. కనుక మార్పుచెందే పదార్థము మార్పుచెందే వ్యక్తికి మార్పుచెందని ఫలితమును ఏమాత్రమును అందించదు. సత్యమైన సుఖమును సత్యమైనపదార్థమే అందించును" అని పదార్థదోషమును బాబా సుబోధకముగ విశదీకరించిరి. గీతాశాస్త్రముకూడా "జన్మమృత్యుజరా వ్యాధిదుఃఖ దోషాను దర్శనం" అని జగత్తునందున్న దుఃఖకారణ దోషములను దర్శించమని కోరుచున్నది. అందువలన యీచరాచరసృష్టి యంతటను వ్యాపించియున్న ఈశ్వరతత్వమును పాలలోని వెన్ననువలె సాధించి వెన్నుని ప్రాప్తించు కొనవలెను. 'యద్దృశ్యం తన్నశ్యం' చూచునందము నశించునదే. క్షణభంగురము, సుఖరహితమునగు యీలోకమును పొందిన మనుజుడు 'నన్నుభజింపుము' అని శ్రీకృష్ణుడు ఉపదేశించెను (ఇమంప్రాప్య భజస్వమాం).

"దృష్టిని అంతర్ముఖము గావించు కోవడంవల్లనే నిజమైన ఆనందము లభించును" అని సత్యసుఖవస్తు ప్రాప్తికి సత్యమార్గమును స్వామివారు దెలిపిరి. సంసారబద్ధులైన జీవులు దృశ్యపదార్థములను సౌఖ్యప్రదములని భావించుటకు గల ప్రధానహేతువు స్వస్వరూప జ్ఞానములోపించుట. ఆత్మ సచ్చిదానందస్వరూపము గనుక ఆత్మస్వరూపులమగు మన సహజలక్షణములు ఆత్మతత్వమునకు భిన్నముగా నుండజాలవు. ఆత్మ పరిశుద్ధమైనది, వికల్పములేనిది. (నిర్దోషం హి సమంబ్రహ్మ) అందువలన మనముకూడ వాస్తవముగ దోషలేశములేని నిశ్చలానంద స్వరూపులము. దీనికి భిన్నముగ వర్తించుచు చర్మచక్షు గోచరమైనయీ లోకమును ఆనందనిలయముగ భావించుట ఆత్మద్రోహాకారమే కాగలదు. దీనికిమించిన ఆత్మవంచన, ఘోరాపరాధము మరొకటిలేదు. "నాల్పేసుఖమస్తి భూమావైతత్సుఖం" అను ఉపనిషద్వాక్యము ననుసరించి అల్పమగు దృశ్యవస్తువునందు వాస్తవసుఖములేదు. అనంతమగు ఆత్మయందే గలదు.

ఇంద్రియ నిగ్రహముచే బుద్ధి నిర్మలమగునపుడు అది తన ఉపాధిరూపమును (ఇంద్రియ రూపమును) గోల్పోయి ఆత్మాకారముగ పరిణమించి అత్యంతిక సుఖమునిచ్చును. ఆత్మావలోకనమునకు లోకజీవనము ఒకసాధనము మాత్రమే. ఇహమును పరము కొఱకు వినియోగింపమని బాబా ఉపదేశించిరి. కాని దురదృష్టవశాత్తు మనము పరమును ఇహము కొరకు వాడుకొను చున్నాము. మానవుడు మాధవుడగుటకు నామరూపాత్మకమైన యీజగత్తు ఒక సాధనాక్షేత్రము. ఆధునిక విజ్ఞానశాస్త్రము మొదలుకొని సమస్త లౌకికశాస్త్రములు, కళలు సాధనా సంపత్తిలోని విభిన్నాంశములు.

విజ్ఞానశాస్త్రము సృష్టిస్వభావమును దెలుపునుగాని సృష్టిరహస్యమున దెలుపజాలదు. విజ్ఞాన శాస్త్రపరిధిలోని దృశ్యవస్తు స్వభావజ్ఞానము కేవలము బాహ్యదృష్టిని మాత్రమే అలవరచి మనలను దృశ్యవ్యామోహబద్ధులనుజేయును. సృష్టిరహస్య జ్ఞానమునుపదేశించు సనాతనధర్మము అంతర్దృష్టిని కలిగించి దృశ్యజగత్తు తోడ్పాటుతో మనలను ఆత్మసాక్షాత్కార యోగ్యులను జేయును. ఈసృష్టిస్వభావ జ్ఞానశక్తితో 'అంతరిక్షయుగ మానవుడు చంద్రుని సమీపించియు లోకమున శాంత్యానందములు స్థాపించలేకున్నాడు. వేదోపదిష్టమైన సనాతనధర్మము సృష్టిరహస్య జ్ఞానవిశేషముతో లోకమున సుస్థిరశాంతిని సత్యసుఖమును ప్రతిష్ఠింప గలదు. ఇదినిస్సంశయము.

"ప్రపంచమునందలి ప్రతిపదార్థమునందు ఐదులక్షణములున్నవి. ఈ ఐదుకూడను అస్తి, భాతి, ప్రియ. రూప, నామములు. అస్తి, భాతి, ప్రియము, ఈమూడును దైవలక్షణములు. రూపనామములు మాయాకల్పితములు" అని శ్రీవారు తెల్పిరి. గీతాచార్యుడు 'అనిత్యమసుఖంలోకం' అనిచెప్పుటలోని అంతర్యము ఏమి? లోకమనగా అస్తి, భాతిప్రియమను దివ్యలక్షణ సమన్వితమగు ప్రపంచముగా మనము భావించరాదు. మాయాకల్పితమగు నామరూపాత్మక జగత్తు మాత్రమే అనిత్యము అసుఖము. రూపనామముల మాయాజాలములో పడిపోవుచు వానిని అభివర్ణించు శాస్త్రిములు మాత్రమే సత్యశాస్త్రములని విశ్వసించి సర్వమునకు ఆధారభూతమైన దివ్య గుణశోభితమగు ఆత్మ తత్వమును, దానిని దర్శింపజేయు శాస్త్ర వాఙ్మయమును విస్మరించుచున్నాము. వృద్ధిక్షయములతో క్షణక్షణము మారుతు కంటికి కనబడునదంతయు అసత్యము మార్పు చేందనిదియు కంటికి కనపడనిదియు బుద్ధియోగముచే మాత్రము గోచరించునదియునగు అస్తి భాతి ప్రియ స్వరూప (సచ్చిదానంద స్వరూప) దివ్యాత్మ మాత్రమే సర్వత్ర నిండి నిత్యమై సత్యమై వెలయుచున్నది.

అందువలననే శ్రీ శంకరాచార్యులు "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" అని ప్రవచించి లోకభ్రాంతిని, విషయవ్యామోహమును ఛేదించివైచిరి. ఈనాడు శ్రీసత్యసాయి జగద్గురువు కూడ విషయ భోగానందము తుచ్ఛమైనదనియు, విస్సారమైనదనియు ఆత్మ సంయోగానందము మాత్రమే సర్వోత్తమమైనదనియు సనాతన ధర్మభేరి మ్రోగించుచున్నారు. ఈభేరీ నినాదమును వీనులవిందుగ శ్రవణము జేయుటతోపాటు మనన నిధిధ్యాస పూర్వక సాధనా సంపత్తితో సత్యశివసుందరరూపమగు సత్యసాయి సామ్రాజ్యశ్రీని వరించి తరించుదుము గాక.

డి. వి. కృష్ణారావు
హైద్రాబాద్

# ఇంటర్వ్యూ

భగవాన్ శ్రీసత్యసాయి దర్శనమునకు దేశములో వివిధప్రదేశములనుండి వచ్చువేలాది భక్తులు, స్వామి "ఇంటర్వ్యూ" కోసము ప్రతినిత్యము ప్రశాంతినిలయ ప్రాంగణములో అత్యంత క్రమశిక్షణతో, ముకుళిత హస్తములతో, శ్రద్ధాభక్తులతో, వినయవిధేయతలతో, స్వామి పిలుపునకై రెప్పపాటులేని వీక్షణములతో కూర్చొనియుండుట చూచి ఆనందించవలసినదేకాని వర్ణింప సాధ్యముకానిది. అట్లునిరీక్షించెడివారిలో బహు కొద్దిమందికిమాత్రమే 'సాయిపిలుపు' సంకేత రూపమున లభించును. అట్టిఅదృష్టమునకు అర్హతపొందినవారి ఆనందమునకు, అట్టిఅవకాశమునకు నోచుకోని అభాగ్యుల మానసిక ఆవేదనకు అవధులుండకపోవుటకూడ అంతసహజమే.

ప్రశాంతినిలయమునకు తొలిపర్యాయము వచ్చి, స్వామిపిలుపుకి అర్హతపొందనివారు తిరుగుప్రయాణమునకునిశ్చయించుకొని, పోతూపోతూ, అందరికన్న ముందువరుసలో, ముమ్మందుగా గంటలతరబడి నిరీక్షించిన మాకంటె, స్వామి వచ్చే సమయమునకు చిట్టచివరలో ఆసీనులైనవారికి ఇంటర్వ్యూలభించుట స్వామి ఆశ్రితపక్షపాతియని నిందించుట మనలో చాలామంది వినుటకద్దు.

కాని నిశితముగాపరిశీలించిన అట్టివారి అపోహ ఆధార రహితమైనదని, అజ్ఞానయుక్తమగు అహంకార సూచకమని వెల్లడగును. ఏమన స్వామిసమక్షములో బీద గొప్పలకు, జాతి, మత, కుల, హోదాలకు తావే లేదు. స్వామివిధించు 'నిరీక్షణ' అనుపరీక్షలో నెగ్గని వారే అట్టినిరుత్సాహమునకు, అపోహకు పాత్రులగుదురు. ఏమన, మననిత్యజీవితములో మానసికోల్లాసమునకై ఏదైనాక్రొత్తసినీమాకు టిక్కట్టుపొందుటకు, నిర్ణీత సమయమునకు కొన్నిగంటలముందుగా అట్టిఆవరణలో ప్రవేశించి, ఎండ, వానలకు లక్ష్యముచేయక పట్టుదలతో టిక్కట్టు పొందవలసియుండుట అందరికీతెలిసినదే. అట్టితరి, పరమాత్మతో కొంతసమయము అతని సమక్షంలో దర్శన, స్పర్శన, సంభాషణావకాశమును పొందుటకింకెంతటి పట్టుదల, ఓర్పు చూపవలెనో మీరే యోచించుకొంచే బోధపడునని స్వామి ఒకపర్యాయము తమసంభాషణలో పేర్కొనిరి. మరియు స్వామి 'ఇంటర్వ్యూ' పొందాలను గట్టిపట్టుదల, ఆకాంక్షగల వారు సమయమునకు ప్రాముఖ్యతఈయక, సాయి పిలుపుకై, స్వాతి చినుకుకై నిరీక్షించు చకోరమువలె నిరీక్షించవలసి ఉంటుందని, మధ్యలో నిరుత్సాహము పొంది స్వామిపైఅలిగి తిరిగిపోవుట సాయిభక్తుని లక్షణము కాదనియు, మీపట్టుదలకు స్వామివిసుగుచెంది 'ఇంటర్వ్యూ' ప్రసాదించేటట్లుచేయుట నిజమైన భక్తుని సామర్థ్యమని, స్వామి తమఉపన్యాసములో పలుమార్లు హెచ్చరించుట మనలకు సువిదితమైనదే కదా.

సాయి తమదర్శనమునకు వచ్చు వేలాదిభక్తులకు వివిధపరీక్షలు విధించి, అందునెగ్గినవారికి అనంత ఆనందమును, తృప్తిని ప్రసాదించుట శ్రీవారి సహజ లక్షణము. స్వామిదృష్టి అనెడు అయస్కాంతము,

నిరహంకారయుక్తము, వినయవిధేయతలు, శ్రద్ధాభక్తు లనెడి శుద్ధ యినుప ముక్కలను ఆకర్షించునేకాని, అజ్ఞాన, అహంకార, అవిధేయతాయుక్తమనస్సుగల త్రుప్పుపట్టిన యినుపముక్కలనే వాటిని ఆకర్షించదు. సాయిసర్వాంతర్యామి, సర్వహృదయవాసియను చిలుక పలుకులను పలికే ఆషాఢభూతులే, కొన్నితడవులందు సాయితిరస్కారమునకు గురై, ఆధార రహితములగు ఊహోహలను కల్పించుటెంతటి దుస్సాహసము, దుర హంకారము, అజ్ఞానమో ఒక్కతూరి సావధానచిత్తు లమై ఆలోచించిన తెలియగలదు.

ఇకఇంటర్వ్యూ పొందినవారి కోర్కెలగురించి సాయి పలుమార్లు ఈక్రిందివిధముగా విశదీకరించిరి.

సంసారబంధములను త్రెంచుకొని, ప్రాపంచిక సుఖములకు స్వస్తిచెప్పి, అరణ్యములనుపట్టి, అనంత కాలము, కఠోరనియమములనుపాటించి, ఏకాగ్రమనస్సు తో ఉగ్రతపస్సు నాచరించిన ఎంతమంది మునిశ్రేష్ఠులకు లభించని పరమాత్మ దివ్యదర్శనము, ఈకలియుగ ములో ఎట్టిప్రయాసలేకుండా, స్వామిదర్శనము స్పర్శ నము, సంభాషించుకొనెడి మహదవకాశము లభించి నప్పుడు, స్వామీ! నాకు మీఅనుగ్రహము తప్ప, వేరొ కటివద్దని ఇంతవరకూ ఏఒక్కరూ అడిగినవారులేరు. మాఅమ్మాయికిగొప్ప సంబంధంవచ్చి వివాహము ఎప్పు డుజరుగుతుంది? మాఅబ్బాయికి పెద్దహోదాగల ఉద్యో గము ఎప్పుడు లభించును? నాఆస్తిఅభివృద్ధికి అవకాశ మున్నదా? మొదలగు ప్రాపంచిక సంబంధమగు ప్రశ్న లతో మీకిచ్చిన మహదవకాశమును వ్యర్థపరచుకొంటు న్నారని నేను మీఅజ్ఞానమునకు జాలిచెందుచున్నాను. కల్పవృక్షమును కామధేనువును దగ్గరపెట్టుకొని మృష్టా న్న భోజనముకోరిన వెర్రిబాపని పగిది సాయిని సామా న్యకోరికలు కోరుట భావ్యమేమో ఒక్కతూరి ఆలోచిం చండి. మానవుని మనస్సనే కీటకము. ప్రపంచము నందలి అన్నివస్తువులపై వ్రాలును. కాని, అట్టిదృశ్య ప్రపంచమున కతీతమగు ఆధ్యాత్మికమనెడి దీపముపై వ్రాలుట కువ్విళ్లూరదు. ఏమన ఏసమయమున కీటకము దీపముచుట్టూ పరిభ్రమించుట మాని, దీపముపైకి వచ్చునో, తక్షణమేనశించును. అట్లే కోరికలపుట్ట అనెడిమనస్సు, ఆధ్యాత్మికసాధన యనెడి దీపముపైకి ఎప్పుడుమరలునో, ఆక్షణమందే ఆత్మవిశ్వాసమును, ఆత్మతృప్తిని, ఆత్మత్యాగమును, చిట్టచివరగా ఆత్మసా క్షాత్కారమునుపొందును. దృశ్యప్రకృతిలో మానవుడు అడుగడుగునా ఏగ్రహమువలన శారీరక మానసిక బాధ లను అనుభవిస్తూ ఉన్నప్పటికీ, 'భగవదనుగ్రహము' ఒక్కటిసాధిస్తే ఏగ్రహబాధలు అతని వద్దకుచేరవు. జన్మయిచ్చిన తల్లితండ్రులకు తమసంతానమునకు ఏస మయమునకు ఏఅనుకూలత ఏర్పాటు చేయవలెననెడి బాధ్యతలున్నపుడు, జగన్మాత, జగత్పతియగుఆపరమా త్మకు, తనఅంశలగు జీవాత్మలను సృజించి, పోషించి, పాలించెడి బాధ్యతలేదా? మీరుకోరినదానికి మీరుఅర్హు లని నిర్ణయించుకొని కోరుతున్నారేమో ఒక్కపర్యా యము ఆత్మవిమర్శ చేసుకొనిన, మీకేయదార్థము తెలియ గలదు. DESERVE BEFORE YOU DESIRE అనెడి స్వామిపల్కునందలి విశేషము అంతసులభ ముగా, తెలియునదికాదు. ఇంటర్వ్యూకి ప్రతిఒక్కడూ సిద్ధపడుచున్నాడేగాని, 'ENTER VIEW' (ఎంట ర్వ్యూ)కి ఏఒక్కడూ ప్రయత్నించుటలేదనే నాబాధయని స్వామిప్రశ్నకు మనదగ్గరెట్టి సమాధానము, సామ ర్థ్యత కలదో ఒక్కపర్యాయము సింహావలోకన చేసిన ఏమీలేదని స్పష్టపడుచున్నది. కనుక మనము ఈక్షణ మునుండైనా స్వామిదృష్టిని ఆకర్షించెడి సత్ప్రవర్త నము, సద్భావములను పెంపొందించుకొనుటకు కృషి సలిపెదముగాక. అట్టిసుగుణములు అలవడుటకు సాయి అనుగ్రహప్రసాదమును దయచేయవలసినదిగా శరణు కోరుటుచితము.

మనసార నీదివ్య మంగళ నామంబు
స్మరియింప మనసున శాంతికల్గు,
కరుణతో ఒకసారి కనులెత్తి జూతునా,
కడుపునిండుగ నుండు కన్నతల్లి,
అమృతహస్తంబెత్తి, అభయమొసంగితే,
అలవిగావి దుఃఖ మంతరించు,

సకలదురితా పహారిణి సాయిమాత,
సర్వజనప్రేమ రాశియౌ సాయిమాత,
సర్వశక్తి సమన్విత సాయిమాత,
శరణు, శరణంటి గావవే సాయిమాత॥

పి. యస్. వి. సుబ్రహ్మణ్యం, శ్రీకాకుళం



## శ్రీ సత్యసాయి ఉయ్యాలపాట

(పల్లవి) ఉయ్యాలలూచండయ్యా — ఉయ్యాలలూచండమ్మా
(అనుపల్లవి) ఒయ్యనొయ్య శ్రీసత్యసాయిక — న్నయ్యకు పుట్టిన పండుగువేడుక
(చరణములు) ముందు వెనుకలకు ఊగేటప్పుడు — సుందరవదనఖకాంతులు చిందగ
గంగోద్భవ మరికాలి మెరుంగులు — వింగికి నేలకు విచ్చెన వేయగ
పాదాలంబి ప్రసవమాలికా — మోదము విశ్వము ముట్టడింవగా
అరుణారుణవసనాంచల దీధితు — లమరలోక పర్యంతము చిమ్మగ
కడుపులోవి పదునాల్గు లోకములు — కదలకయుండెడురీతి మెల్లగా
అభయహస్త విన్యాస వైఖరులు — త్రిభువన భవన పతాకలు కాగా
ఎగుభుజములపై విగువు సొగసులవి — జగతీభారము జట్టిగొనంగా
సన్నపు నవ్వుల వెన్నెలమొలకలు — మిన్నుల పందిరిమీదికి ప్రాకగ
తాంబూలారుణ దంతద్యుతులవి - అంబరవీధుల నలముకొనంగా
నాసాపుటముల వాసితపవనము — ఉపనిషత్తులకు ఊపిరిపోయగ
దయగల కన్నుల తరిపివెన్నెలలు — ఎల్లలోకముల వెల్లివిరియగా
మూసిన మూడవ కంటివెలుంగులు — ముల్లోకములకు అభయమొసంగగ
విశాల ఫాలపు వెలుగువెల్లువలు — దిశావలయమును చుట్టుముట్టగా
నీరదనీల శిరోజకిరీటము — విగనిగకాంతులు జగము నిండగా
ఊగే సాయిలా మూగే తలపులు — పాగే జగముల చల్లగ సాకగ

డా॥ రామరాజు

# సేవద్వారా మనశ్శాంతి

శ్రీ సాయిబాబా గురించి మొట్టమొదట నేను, నా నియోజకవర్గంలో ప్రజానుకూలంకోసం కొంతమంది సంఘసేవకులు నడుపుతున్న ఉచిత వైద్యశాల వల్ల తెలుసుకున్నాను. ఆ వైద్యశాలను వారు నా నియోజకవర్గంలో ఒక మురికివాడలో నడుపుతున్నారు. అయితే ఆ వైద్యశాల గురించి ఎట్టి ప్రకటనలు గానీ, ప్రాపగాండా గానీ లేవు. నాకుకూడా ఈ విషయం గురించి అనుకోకుండా తెలిసింది.

తద్వారా నేను చాలా విషయాలు తెలుసుకున్నాను. (1) సాయిబాబా భక్తుల్లో మలేషియాలో వున్న వివిధజాతులవారూ, వివిధ మతాలకి చెందినవారూ ఉన్నారు. వైద్యశాల నడుపుతున్న వారిలో నిర్వాహకుడు హిందువు. డాక్టరు గట్టి క్యాథలిక్ క్రైస్తుడు. మలయావాసులు, భారతీయులు, ముస్లిములు, బౌద్ధులు వారి సేవలు పొందుతున్నారు. (2) వారు తమ సేవలకు ప్రకటనలను ఆశించక నిస్వార్థంగా చేస్తున్నారు. (3) బాబా భక్తులందరూ భగవంతుని యెడల ప్రగాఢ భక్తి కలిగినవారు. బాబాయందు భక్తి కల్గివున్నప్పటికీ తాము నమ్ముతున్న లేక తమ వంశపారంపర్యంగా సంక్రమించిన మత సిద్ధాంతాలను పద్ధతులకనుగుణంగా నడుచుకొంటున్నవారు. జాతి, మత, కులాల కతీతులై మానవజాతి సేవకోసం తమ సర్వస్వం అర్పించినవారు. మలయా, చైనా, భారతదేశాల పౌరసత్వమూ, ప్రపంచంలో వున్న మతాలన్నిటికీ సంబంధించిన ప్రజలున్న మలేషియాలో జాతి, మత, కుల వివక్షతలులేక సర్వమానవ సేవయే ధ్యేయంగా పెట్టుకున్న వారి క్రియలు చాలా అభినందనీయం. మలేషియాలో వున్న సాయి భక్తులందరూ గ్రామాల్లోనూ, ఆసుపత్రుల్లోనూ, వృద్ధులకోసం ఏర్పరచిన ప్రత్యేక గృహాల్లోనూ, అనాథశరణాలయాల్లోనూ తమ సేవలనందించితే అది యావత్ దేశంమీద చెరగని ముద్ర వేస్తుందనడంలో సందేహం లేదు. ప్రస్తుత ప్రభుత్వం ధ్యేయంగా పెట్టుకున్న "ముహిబ్బా" లేక సర్వుల్లోనూ అందరి యెడలా మంచితనం పెంపొందించడానికి మీరంతా మీమీ సేవలనర్పించడంద్వారా మాత్రమే చేయడం సాధ్యమవుతుందని నేను నమ్ముతున్నాను

దిన దినానికి అసంఖ్యాకులైన మలేషియా చైనీయులు సాయి భక్తులవడం నాకు ఆశ్చర్యం కల్గిస్తున్నది. భారతదేశాన్ని చూస్తామని కలలోకూడా ఊహించని మలేషియా చైనీయులు సాయిబాబాను చూడ్డానికి భారతదేశం పోతున్నారు. క్యాన్‌టాన్ ప్రాంతంలో సాయి భక్తులు దాదాపు నూటయాభైమంది పిల్లలకు మతం, వేదాంతం, నీతి శాస్త్రపు పాఠాలతోపాటు ఆధ్యాత్మికానికీ, భక్తికీ చెందిన పాటలనుకూడా నేర్పుతున్నారు. మలేషియా ప్రభుత్వం, దైవంలో నమ్మకం కల్గియుండడం దేశ పౌరసత్వపు మూలస్తంభాల్లో ఒకదానిగా ప్రకటించింది. మన దేశపు యువతరం తమ దృష్టిని భగవంతుని దిశ మరలించి, ధర్మం, ఆధ్యాత్మికం, నీతుల గురించి పట్టించుకున్నట్లయితే దారితప్పి పోతున్నందుకు కారణమయిన పాశ్చాత్యరీతులనుండి, మత్తు

మందుకు దాస్యత్వంనుండీ తదితర సమాజ వ్యతిరేక శక్తులనుండీ రక్షింపబడినవారవుతారు.

ఈ దేశపు పౌరులను తమకు యిష్టంవచ్చిన మతానికి చెందిన దైవాన్ని ఆరాధించుటలోనూ, భగవంతుని వునికిని గుర్తించేట్లు చేయడంలోనూ నిష్ణాతులుగాచేసి తమ తల్లితండ్రులపట్ల, కుటుంబంపట్ల, తమ విద్యాలయాలపట్ల దేశంపట్ల తమకున్న విధులను బాధ్యతలను ఎరుకలోకి తెచ్చేట్లు సాయి ఉద్యమం చేస్తే, అంతకన్న ఈ దేశానికి ఆ ఉద్యమం చేయగలిగిన సేవ మరొకటి లేదు. సాయి భక్తులు ప్రపంచంలోని దాదాపు ప్రతి దేశంలోనూ ఉన్నారనీ వారి జీవితాలని కాంతివంతం చేయడంలో సాయి ఒక గొప్పశక్తిఅనీ నేను విన్నాను. సాయి సన్నిధిలో మాత్రమేకాక సాయినుంచి కొన్ని వేల మైళ్ళ దూరంలో జరుగుతున్న లెక్కలేనన్ని మహిమల గురించి కూడా నేను చదివాను. వీటన్నిటికంటే భగవంతుని యెడల నమ్మకం లేనివారికి దైవ భక్తి కలిగిస్తూ, ఏవో పూజలూ పునస్కారాలు చేయడం తప్ప నిజంగా భగవన్మార్గంలో పయనించని వారిని సరియైన మార్గంలో పెట్టడంద్వారానూ, దైవసందేశాన్ని ప్రపంచంలో చాటేందుకు మనుషులను తయారు చేయుటకు ఒక పెద్ద మహిమగా నేను భావిస్తున్నాను. అంతేకాక తమ సాటి సమాజానికి, వ్యక్తులకూ నిస్వార్థంగా సేవ చేయడంలో నిమగ్నులను చేయటం మరింత ముఖ్యమైన మహిమగా నేను తలపోస్తున్నాను.

మతం మానవుల్లో సరియైన మార్గంలో, ధర్మపథంలో నడిచేట్లు చేయటానికి ఒక సాధనం. అయితే ఆధునిక సమాజంలో మతం మనుషులపై తనకుగల ఆధిపత్యాన్ని, ముఖ్యంగా యువతపైతనపట్టును కోల్పోయింది. వేగ జీవితమే లక్ష్యంగా ఈ నాటి మతంగా మారిపోయింది. ఈ కొత్త విధానం చెప్పడానికి వీలు లేనన్ని కష్టాలను ఎన్నోకుటుంబాలకు కొనితెచ్చి పెట్టింది. తమ సర్వాన్ని ధారపోసి పెంచి పెద్దచేసిన పిల్లలకు తమ తలితండ్రులకు భారంగా తోస్తున్నారు. జీవిత సమరంలో మున్గి తేల్తున్న పెద్దలకూ, పిల్లలకు కూడ మతం ఈనాడు చాలాముఖ్యమని వాఅభిప్రాయం.

ఆధునికమానవుడు విజ్ఞానాన్నీ, శక్తినీ, అధికారాన్నీ, గౌరవాన్నీ ఎట్లయినా సాధించవచ్చు, అయితే మనశ్శాంతిని మాత్రం ఎవరివద్దనుంచీ పొందజాలడు. ఈనాడు మనశ్శాంతి చాలాప్రియమైన వస్తువయిపోయింది. ప్రపంచంలో ప్రతిదేశంలోను పెర్గిపోతున్న ఆత్మహత్యల సంఖ్య జీవితంలో సుఖశాంతులకి ధనం ఒక్కటే మూలంకాదని నిరూపిస్తున్నది. అధికారం, గౌరవం అశాశ్వతమయినవని మనచుట్టూ జరుగుతున్న సంఘటనలు తెలియచేస్తున్నవి. ప్రతివ్యక్తికీ మనశ్శాంతినీ, ఆధ్యాత్మిక మార్గాన్నీ తద్వారా భగవంతునిలో సాధించడం చాలాముఖ్యం.

మనలో చాలామంది భగవంతుణ్ణి ప్రార్థించడానికి నిస్వార్థ సేవకు సమయాన్ని వెచ్చించడానికి చాలా వెనకాడతాం. అయితే సాయి ఉద్యమంలో కార్యకర్తలు తమకుతోచిన మతానుగుణంగా, తమ యిష్ట దైవ ప్రార్థన చేసుకుంటూ, నిస్వార్థ సేవలో అంకితమయితే, వారందరికీ మనశ్శాంతి దొరుకుతుందనటంలో నాకు ఎట్టిసందేహమూలేదు. తద్వారా వారు సుఖశాంతులను పొందటమేకాక మిగిలినవారికి కూడా ఆనందం, మనశ్శాంతి అందచేసిన వారవుతారు.

— వై. బి. దాటోట్యూసిప్.
పరిశ్రమలూ వాణిజ్యశాఖల ఉపమంత్రి
మలేసియా.

# స్వాగతము

1. సీ॥ స్వాగతమో! నవభావ యువకులార!
సాయిఘనకుటుంబ సభ్యులార!!
స్వాగతమో! దేశభాగ్యదోహలులార!
"ఆత్మవిజ్ఞాన" విద్యార్థులార!;
స్వాగతమో! సుఖశాంతి కాముకులార!
సత్త్వగుణాధిక జ్ఞానులార!!
స్వాగతమో! బంధు పశ్చిమ ప్రజలార!
భారతావని గన్న ప్రాజ్ఞులార!!

గీ॥ రండు రండోయి! మీకిదే యండ దండ!!
సాయి పరమాత్ము వీక్షించి శాంతి గొనుడు!!
జరుగనున్నది భగవాను జన్మదినము!!
బంధుతతికెల్ల ఆహ్వాన పత్రికిదియె!!!

2. సీ॥ సాయి సంఘమ్ముల సమ్మేళనమ్మట
అరువది దేశాలు పిలుపునందె
యావత్ప్రపంచ మహాసభ మూడవ
సారిగా పర్తిలో జరుగుచుండె
విచ్చేయుచుండిరి వేవేలసభ్యులు
పాల్గొన సభలందు భక్తులగుచు
ఎన్నోవేలకు పైనొ ఇతర దేశస్థులు
లక్షలు మించున ప్రేక్షకులును

ఆ॥ ఇంత మందికి దగునేర్పాట్లు గావించె
ముందు దృష్టి భక్త బృందములకు
సకలదేశప్రజకు సమభావదృష్టితో
"స్వాగతమ్ము" పలుకు! సత్యసాయి! ॥

3. ఆ॥ ఉత్సవములు జరుగు నొయ్యారమొలుకాడ
సాయి సంఘములట సమ్మేళనముగాగ
కన్నులార మీరు గాంచవలయుగాని
ఎన్నవశమె నాకు అన్నలార ॥

4. ఆ॥ దైవ మన యేమొ! ధరణికి దెల్పెడు
శక్తిగల జనకుడు సత్యసాయి!
పుట్టపర్తియందు పుట్టినపండుగ
రహిని గాంచ మీరు రండు రండు!!

— నండూరి భాస్కర శ్రీరామరావు,

# ఆత్మ విచారము

ప్రియమైన ఆంధ్రా! "ఆత్మవిచారము ఐదింట నాలుగువంతులు, ధ్యానము ఐదింట ఒకవంతు, అని నుడువుటలో బాబాగారి అభిప్రాయమేమి? "భగవజ్జ్యోతి" అనగానేమి? వ్యక్తియొక్క దోషములు బలహీనతలు బట్టబయలైనప్పుడు, తానేమియును చేయకుండుటలోని అంతర్యమేమి? అనునవేనా నీ ప్రశ్నలు?"

వీటన్నిటికి సమాధానములు బాబాగారు చేయుచు వచ్చిన దివ్యోపన్యాసములలో దొరకును. నీవు స్వయముగా వానిలోని ప్రశ్నలకు సమాధానములు పొందగలవు.

మనలను గురించిన వాస్తవవిషయములను తెలిసికొనుటకు మనముచేయు ప్రయత్నములకు, ఆత్మవిచారము అతిముఖ్యము. మనమెంతవరకు జాగ్రదవస్థలోనున్నాము? ఎంతవరకు నిద్రావస్థలోనున్నాము అని విచారణసలుపుట ఆత్మవిచారారంభమునకు మంచి లక్ష్యమగును. ఒకడు వేకువ జామున సగము నిద్దురమైకముతో మేల్కాంచవచ్చును! తాను సక్రమముగా ప్రవర్తించుటకై, వ్యక్తితనను ఆవరించిన ప్రపంచము, ఆ ప్రపంచములో తన అంతస్తుకు సరిపడువిధముగా అతిజాగరూకతతో వ్యవహరింపవలెను.

ఏదైనా పనిచేయునపుడు పగటికల, లేదా ఊహాగానము లేదా కల్పన, ఏకాగ్రతతో కలసిపోవుట చేత, ముఖ్యమైనదానినే కోల్పోవుట జరిగి తత్పర్యవసానముగా తప్పులు చేయుట తటస్థించునని గ్రహించితివా? దాదాపు ప్రతివ్యక్తియు ఇట్టి అనుభవములను పొంది యేఉండును. కనుక ఒక కార్యారంభము లేక ప్రయత్నము చేయుటకు పూర్వమే, అతడు మెలకువగా ఉండవలసిన అవసరమును గ్రహించగలుగును.

ఆధ్యాత్మిక జీవితములోను ఇంతే. వ్యక్తి తన నిజపరిస్థితిని తానుగాగాని, లేదా ప్రాపంచిక ధోరణి తోగాని, ఏదో ఒకవిధముగా తెలుసుకొనును, అను భూతిని పొందగలుగును, సంశయా విమర్శలు తప్పకుండా కలుగకపోవు. ఈ ఆత్మవిచారముద్వారా తనకుతాను, ప్రపంచమును సునిశితముగా విమర్శించే జ్ఞానము లభ్యమగును. బుద్ధుడు తనకు తానై స్వబుద్ధి పైన ఆధారపడు ఇట్టి శోధనసలిపి, తుదకు నెమ్మదిగా నొక తరువు క్రింద (ధ్యానముద్రలో) కూర్చుండి జీవితసత్యమునరసి వాస్తవ ప్రపంచమును చూచెను. ఈ చల్లని, తిన్నని జ్ఞానమార్గము, అత్యంత కఠిన మైన మార్గమని బాబాగారు నుడువుచుందురు.

ఆత్మవిచారమునకు అర్థము 'ఉద్దేశ పూర్వకమైన ఇచ్ఛాశక్తితో సందేహ నివృత్తిని గావించుకొనుట', లేదనవచ్చును. ఆత్మను, విశ్వమును ప్రశ్నపరిశీల నాదులచేత శోధనకొనసాగించుచు ఉన్నయెడల, దృశ్య ప్రపంచము ద్రష్టనుండి పూర్తిగా స్వతంత్రించి యుండదని విదితమగును. ఎందుకనగా ద్రష్టద్వారానే దృశ్యము గోచరించును. ఈ స్పష్టమైన విషయా వలోకనముద్వారా ద్రష్టను గుఱించి తెలుసుకొనుట లోని వైఫల్యమును గుర్తించుటలోగల న్యూనతను సులభముగా చూడవచ్చును. ఈ విషయములయొక్క వాస్తవికవిచారములు సలిపిన కొన్ని ప్రమాదములు సంభవించవచ్చును. మనస్స్వానుభవము లేదా అంగీ కారమునకు గాఢమైన అతిక్రమణ, ఉల్లంఘన ఉన్న ప్పటికినీ, ఒక సంపూర్ణాధికారముగల ముఖ్యమైన ఆత్మవిచారదశ, తనవియును అసంపూర్తియైనవియును నగు అభిప్రాయములను బయలుపెట్టుట లేదా నిరాక రించుట జరుగును. ఏదైతే తీవ్రమైన రక్షణక్రింద నిలువజాలదో, అది నిరాకరింపబడును; విమర్శింప బడును. ఉదాహరణకు :— శరీరము నేను (అహం) అను నీరెండును ఒకటే అను స్థిర (జీవితాంతపు) నమ్మకము, ఒక అసంపూర్ణాభిప్రాయము. ఈయభి ప్రాయమునకు వచ్చుటకు పూర్వమే విచారణ కొన సాగవలెను.

ఈ స్వీయవిమర్శ, ముక్కాలి ఏకాగ్రతతో గూడిన రీతిగా రమణమహర్షులు నుడివినట్లు "నేనెవరు ?" అను ప్రశ్నద్వారా తెలియజేయబడినది. వారు ఈ శతాబ్దమునందే జీవించినవారని మీ కందరకును తెలి సిన విషయమేకదా ?

తీవ్రమైన ఆత్మవిచారము చాలదని బాబాగారు అందురు. ఇది ఫలించుటకు ధ్యానమే, సఫలతతో గూడినజయము చేకూర్చెడి మార్గము. కనుక, విశ్వ ముయొక్క వాస్తవికతను అన్వేషించుటకు భక్తి మార్గ మును శరణ్యము. అనగా ఆత్మవిశ్వముల వాస్తవికత లనరయుటకు భక్తి మార్గముయొక్కటే గానవచ్చు చున్నది.

గోచరించు ప్రతి దృగ్విషయము ద్వారా వ్యక్తి పరికించి దేవుని యదార్థ సత్యమును భావించకొనును. పైననుండినవన్నియును స్వామివారు నుడివిన విష యములే ; ఆత్మవిశ్వముల వాస్తవ విషయముల విచారములు ఐదింట నాలుగు వంతులేనని స్వామి వారందరు. ఈ ఆత్మాన్వేషణలో వ్యక్తి తన ప్రజ్ఞాను భవములను సంపూర్తిగా విశ్వసించవలెనని నిశ్చయించు కొనవచ్చును. ప్రయత్నవైఫల్య పద్ధతిమూలముగానై నను నేర్వవచ్చును. ఆధ్యాత్మిక ప్రపంచములో స్వయంనిర్మిత వ్యక్తులు (అనగా సహజపండితులు) ఉన్నారు. అయితే ఇట్టి ప్రయత్నరంగమందు శిష్యుడు తగిన సద్గురువుద్వారా వేగిరముగా తనకు తెలియని విషయములనరసి గమ్యమును చేరుకోగలడు.

సద్గురువులు లభ్యమగుట ఒకపెద్దసమస్య. బాబా గారు సెలవిచ్చినట్లు నేడు అర్హతగల మంచిగురువులు లభ్యమగుటలేదు. ఈ నాడు అర్హతగల గురువు దేవుడొక్కడే. నిజమైన అపేక్షకుడు దేవుని సదుపదేశముకోరిన, దేవుడే తనకు గురువుగా ప్రత్యక్షము కాగలడు. శ్రీ సత్యసాయిబాబాగారిని సర్వవ్యాపియైన భగవంతుడని విశ్వసించు భక్తులు శ్రీవారి బోధనలను ఆచరిస్తున్నామా ? అని ఆత్మవిచారము చేసుకొనుట అవసరము.

"చీకటి ఎక్కడకు పోతుంది ''? అందురు స్వామివారు. చీకటి ఎక్కడకు పోదు. ఎచ్చట వెలుగు ఉండునో అక్కడ చీకటిఉండదు. ప్రభువైన శ్రీ స్వామివారే వెలుగు, వారే ప్రేమ. ఆ దివ్యజ్యోతిలో మనదుర్గుణములను చీకటిప్రాణులు మనజాలవు.

సర్వవ్యాపియైన దేవుని మనస్సు, భావములు, ప్రవర్తనల కేంద్రముగా భావించినచో, దేవుడు మనలోనే ఉన్నాడు. మనప్రక్కనే ఉన్నాడు, మనతోనే ఉన్నాడు, ప్రతిజీవితక్షణములోను ఉన్నాడు. అతని జ్యోతిని అన్వేషింపుము; ఆజ్యోతిలోనే మనుము; గతమగు చీకటి, ఇప్పటి పీడలు సమసిపోనీ; అదే నీప్రశ్నయొక్క రెండవభాగమునకు స్వామివారిచ్చు జవాబు. స్వామివారి భాషణలు చదువుము, బోధనలను చక్కగా మననముచేసుకొన్న మఱలమఱల నీ సమస్యలకు కోరిన జవాబులు లభించును; వేరెందును వెదకనవసరములేదు.

జాన్ హిస్లప్

## భ భాష

ప్రేమముదిత మానసమును నాయందులగ్నముచేసి, యోగానందమునమునిగిన మహర్షుల భంగి సర్వస్వమూ మరచి, సముద్రము నైక్యముచెందిన నదులబోలె, వారందరూ (గోపికలు) నాలోలీనమైనారు (భాగవతము XI -12-12)

స్వానుభవవ్యక్తీకరణకు, పరస్పరానుభవవ్యక్తీకరణకు, మానవుడు బాషలను పెంపొందించెను. రోదసీయానము చేయురాకెట్లను చంద్రగ్రహోపరితలముపై వ్రాలిన వాహనములను, భూభ్రమణముచేయు కృత్రిమ ఉపగ్రహముల చలింప నాదేశింపజేయుటకునూ మానవునకు భాషలుకలవు. యంత్రములతో సంభాషణ సలిపి, సమస్యలను చర్చించి, వానినుండి పరిష్కారమార్గములనన్వేషించుచున్నాడు. కాని తన ఆత్మనివాసి, అత్యంతసన్నిహితుడు, తనజీవనసర్వస్వమూ, తనమనుగడకు మూలాధారుడై, తనతోనేనివసించుచున్న భగవంతునితో సంభాషణ సలుపలేనిమానవునకు ఈ భాషలన్నీ నిరుపయోగములు.

ఇంద్రియములనుండి, సంసారబంధములనుండి విముక్తి నన్వేషించే మానవునకు వాగ్వివాదములు, ఉద్వేగపూరిత వక్తృత్వములూ చాలాదూరము తీసికొనిపోలేవు. అనంత కృపతో భగవాన్ బాబాగారిట్లనిరి: నిజముచెప్పాలంటే, నాపొందుగోరేవారికి భాష ఒక ప్రతిబంధకము. భావవ్యక్తీకరణకు, కపటప్రదర్శనలకూ భాషలున్నవి. కాని నేను పలికేది, వినేది

ఆత్మభాషనుమాత్రమే. భక్తిప్రేమలు, సమత్వ సామ రస్యములు ఆ భాషకు అంతర్వాహినులు". మనో నిర్మాలనము, ఆత్మానుభవముల మూలముననే శాశ్వత సుఖశాంతులు, ద్వంద్వములనుండి సంసార బంధ ములనుండి విమోచనముకలుగునని మతగ్రంథములు వక్కాణించుచున్నవి. 'అతిసూక్ష్ముడు, అత్యధికుడునగు పరమాత్ముని గాంచగనే, సందేహములు నమసి, మనోబంధములు బ్రద్దలై, కర్మకరుగును" అని ఉపని షత్తులు ప్రవచించుచున్నవి(ముండకఉపనిషత్తు VI-2-2). అట్టిజ్ఞానార్జనయే సాధకుని తపోనిష్ఠం అంతిమ ఫలము.

భవబంధబంధితులై, ఇంద్రియలోలులై, భవసాగ రమును దాటుటకై భగవానుని కరుణనే ఆధారముగా చేసికొనిన సామాన్యమానవులకు జ్ఞానమార్గము సరి యైనమార్గము కాదని అనేకవేల సంవత్సరముల క్రిందనే మనమహర్షులు కనుగొనిరి. జ్ఞానమార్గము నకు దీటైనదై, ఫలవంతమై, అవలంబనాసులభమైన మార్గము భక్తిమార్గమేనని వారుతెలిసికొనిరి. వ్యాస, శుక, ఉద్ధాలకాదులు భక్తిమార్గమనుసరించి, ఈమార్గము వలనకూడా, జ్ఞానమార్గమును పొందబడిన సచ్చిదానం దమయ బ్రహ్మానందమును పొందగలమని నిరూపిం చిరి. ఆధ్యాత్మిక ఔన్నత్యము నొందిన అట్టి ఇతి హాసయుగమందే భక్తిమార్గము ఫలవంతమైనప్పుడు, ఆధ్యాత్మిక అధోగతినందిన నేటి మానవాళికి భక్తి మార్గమే శరణ్యము. ఉపనిషత్తుల సారము కలిగి, నేటిమానవుల నుద్ధరింప సామర్థ్యముగల మార్గము ఒక్క భక్తిమార్గమేననుటలో సందేహములేదు. 'పురా ణములలోను, స్మృతులలోను పరిపక్వమొందిన భక్తి భావము, అన్వేషించేవారికి ఉపనిషత్తులలో బీజ రూపమున కన్పించును' అని వివేకానందుడుమడివెను.

మనము భక్తులమనుకున్నంతమాత్రాన, భక్తి నర్థము చేసికొన్నంతమాత్రాన, మనము ధ్యేయము నొందలేము. సాయి భగవానుని దర్శించుచున్న ప్పటికినీ, భగవానుడు, ప్రేమౌన్నత్యమునుగ్గడించు జ్ఞానభరితసుందరమకరందపదములను వినుచున్నప్ప టికినీ, అతనిని తలంచినంతమాత్రముననే ప్రేమతో మనము ఉప్పొంగుచున్నప్పటికినీ, వారిచేత దివ్యా త్మస్వరూపులారా' అని అనిపించుకొనుచున్నాముగాని, 'భక్తులారా' అని పిలిపించుకొనే భాగ్యమునకు నోచు కొనలేకపోయినాము.

నిరంతరదైవనిరతి భక్తిమార్గమునకు ముఖ్యము. 'నిరంతరసాధనచే యోగ్యత సంపాదించిన మాన వునకు, భక్తి తప్పక పట్టుబడును' (నారదభక్తి సూత్రము 63). గోపికలటువంటిభక్తికి గీటురాళ్లని వారిభక్తి ఆత్మానుభవమునొందిన యోగులతో సమాన మని కృష్ణ భగవానుడు ఉద్ధాలకునితో చెప్పెను (దీనినే ఈవ్యాస ఉపరితలమున పేర్కొంటిని). ఈ యుగమునందుకూడా. మీర, తుకారామ్, రామకృష్ణా దులు అట్టి భక్తి పరాకాష్టనందిరి.

వ్యాసుడు ఉపనిషత్తులు, పురాణములు. ముఖ్య ముగా బృహద్గ్రంథమైన భాగవతముననవసరముగా రచించ లేదు. భక్తిమువ్విధముల పునీతమని శ్రీశు కుడు మహాభాగవతములో చెప్పెను. 'వాసుదేవకథా సుధ వర్ణించేవారిని, పశ్నించేవారిని. వినేవారిని—ఈ ముప్పురను పవిత్రమొనరించును. ( X-1-16). జ్ఞానమార్గోపదేశక శిరోమణియైన శంకరాచార్యులవారు, బ్రహ్మానందమును బడయుటకు భక్తియే శ్రేష్ఠమని చెప్పుట మరువలేదు. పూజపునస్కారాదులు సలు పుటకు వారు అనేక స్తోత్రములనుకూడా వ్రాసిరి. మోక్షకాములై మొదట విగ్రహారాధన చేసిననూ. వారు చివరకు నిష్కామస్థితిని పొందగలరని

శంకరాచార్యులవారు చెప్పిరి. 'మోక్షమార్గములలో, భక్తియే మహోన్నతమార్గము. సత్యస్థితిని బడయుటకు చేయు అనవరత సాధనేభక్తి' (వివేకచూడామణి_32). అరుణాచలమును ప్రథమదర్శనలోనే భక్తావేశితుడైన రమణమహర్షి, అరుణాచలుని శరణుజొచ్చుచూ 'ఓ తండ్రీ నీఆజ్ఞానుసారము వచ్చి నీశరణాగతుడైనాను' అని అనెను. భక్తి జ్ఞానములొకటేనని అతనిమతము 'ఈశ్వరునిచెంతకువచ్చి, అతనిలో లీనమొందుటకు ప్రార్థించిన తరువాత. విశ్వాస ఏకాగ్రతలతో అతనికి పూర్తిగా శరణాగతుడనగుదును. దాని తరువాత ఇక మిగిలేదేముంది': 'విశ్వాస ఏకాగ్రతలతో శరణాగతుడనగుట' అను విషయము గమనార్హము.

జ్ఞాన భక్తి యోగములను మాత్రమే భగవద్గీత ప్రవచించును. అనేకులకు రాజబాట అయినటువంటి భక్తి మార్గమునకు, కర్మ. రాజయోగములు అనుసంధానములుమాత్రమే. 'అవ్యక్త పరబ్రహ్మమునందాసక్తిగల మనస్సుగలవారికి బ్రహ్మమందు నిష్ఠను బొందుటలో సగుణపాసకులకంటె ప్రయాస చాల అధికముగనుండును. ఏలయనిన, నిర్గుణోపాసన మార్గము దేహాభిమానము గలవారిచేత అతికష్టముగా పొందబడుచున్నది (గీత XII-5). మానవాళిపై బాబాగారికున్నంత ప్రేమతో అర్జునునకు శరణాగత కర్మఫల త్యాగాదుల గురించి తెలుపుతూ, కృష్ణభగవానుడు చివరకు ఈవిధముగ ఆదేశించెను. 'నాయందే మనస్సును స్థిరముగ నిలుపుము. నాయందే బుద్ధిని ప్రవేశపెట్టుము, పిమ్మట నాయందేనివసింతువు. సందేహములేదు'. (గీత XII-8). భగవాన్ బాబాగారు కూడానదేసందేశమునందించిరి. 'భక్తునివిశ్వాస భగవంతుడు, అతనికర్మలు భగవంతుడు, అతని ఆలోచనలు భగవంతుడు. అతనివాక్యములు భగవదుచ్చారణములు'.

భక్తిపరిభాషలో అన్ని నామములు, అన్ని రూపములొక్కటే. హనుమాన్ విభీషణులకు రాముడు, గోపికలకు కృష్ణుడు, మీరాబాయికి గిరిధర గోపాలుడు. శ్రీరామకృష్ణపరమహంసకు జగన్మాత, మనలోచాలామందికి భగవాన్ శ్రీసత్యసాయిబాబా ఇష్ట దైవము. కృష్ణ భగవానుడు ఇష్టదైవారాధనను అనుమతించుచూ ఈవిధముగచెప్పెను: "ఏ భక్తుడైననూ, ఏ రూపమునారాధించిననూ, ఆ రూపముపై అతనివిశ్వాసమును స్థిరమొనరింతును (గీత VII-21). అన్ని ఆరాధనలూ చిత్తశుద్ధిని కలిగించును.

అవధులులేక, మానవాళిని, సమస్తసృష్టిని ఆవరించి, వాటికి మూలాధారుడైనటువంటి భగవంతునిపై ప్రవహించే ప్రేమే భక్తి భాష. అటువంటి వానికి సర్వకాల సర్వావస్థలయందు భగవంతుడు గోచరించును. 'ఎవడు సమస్తభూతములందు నన్ను చూచుచున్నాడో, మరియునాయందు సమస్తభూతములను గాంచుచున్నాడో అట్టివానికి నేను కనబడకపోను, నాకతను కనబడకపోడు (గీత VI-30) సర్వమానవులందు, సర్వభూతములపైగల ప్రేమ పూజగామారినప్పుడది భక్తిగా పరిణామముచెందును' అని బాబాగారుపలికిరి.

నిరంతర దైవచింతన, తీవ్రభగవదావేదన, భగవంతుడే నాప్రాణాధారమనే గోపికాభక్తి, భక్తిభాషయగును. ఆభక్తి జప, తప, స్వాధ్యాయ, ధ్యాన, దాన, దయ, సేవ ధర్మాదులనుండి పొంగిపొరలి వివిధ రీతుల వ్యక్తమగును.

భగవదనుగ్రహము, భగవదారాధన మినహా అన్యమాశించక నిష్కామమై, సమస్తమూ భగవదంకితమొనరించే శరణాగతభావముతో కూడిన దైవ విశ్వాసమే భక్తిభాష. భగవదనుగ్రహము మనపైనిరంత

రముకలదు. మనహృదయములను పవిత్రము జేసి దాని విన్యాసమునకు తావీయవలెను.

కర్మఫలత్యాగమే కాకుండా, కర్మనుకూడా భగవదంకితమొనరించే గుణమే భక్తిభావ. మనోచాపల్య మూలమున కామక్రోధములు జన్మించినను, వానిని గూడ భగవదంకితము చేయవలెను. సమస్తకర్మలు, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులు, సమస్తమూ భగవంతునివైపు ప్రవహింపజేసి, లేక వానిని భగవద్భక్తిలోనే వినియోగించవలెను. (నారద భక్తి సూత్రము 65). అందరికీ అందుబాటులోనున్న మార్గమును కృష్ణభగవానుడు గీతయందు పేర్కొనెను. 'కుంతీపుత్రా'! నీవేమిచేసినను, ఏమిభుజించినను, ఏది హోమమొనర్చినను, దానిని నాకంకిత మొనరించుము. (IX -27). ఉద్ధవునకు గూడ భగవానుడదే సందేశ మొసగెను. 'మనోబుద్ధులు నాకంకితముచేసి, నాకానందమొనరించే రీతివర్తించి, సర్వదానన్ను మనంబునందుంచి, సమస్తకర్మలూ నాకోసమేచేయుట నేర్వవలెను. (భాగవతము). ఇంతకంటే నిర్మలసందేశ మెచ్చటను కానరాదు.

విజ్ఞానమభివృద్ధి గాంచినప్పటికినీ, ప్రాపంచిక పురోగతిమిన్నంటి నప్పటికినీ, భయనిరాశలు మానవమస్తిష్కమునావరించి, దానిని అంధకార బంధుర మొనర్చుచున్నవి. నిరాశ నిస్పృహలతో మానవ ఆత్మ శుష్కించుచున్నది. కానీ ఈరణగొణ ధ్వనులమధ్యకూడా, గంభీరమై, తేటతెల్లమై, అందరూ ప్రేమమార్గోన్ముఖులు కావలెనని, ఆమార్గమే తనవైపునకు మరల్చుననే భగవాన్ బాబా చల్లనిపిలుపు వినేవారికి వినిపించును. మనముకొన్ని అడుగులు ముందుకువేసిన, వారు రయమున మనవైపునకు వత్తురు. వారి అత్యంత అనుగ్రహముపై విశ్వాసముంచి, సర్వము అతనికి సమర్పించి, మనసాధన సాగుకొలది అతనికి పూర్ణశరణాగతులమై వర్తించిన వారు ఏనాడో ఒకనాడు అత్యంత ప్రేమానురాగములతో మనలను భక్తులని సంబోధించెదరు.

సి. పి. కె. నాయర్.

# ఆ త్మ బ ం ధు వు !

కనుగొంటినేను కనుగొంటిని।
కనులారా బాబాను కనుగొంటిని।।

శిరముపై అందాల కురుల మకుటమ్ము
మేనుపై శోభించు పీతాంబరమ్ము।
ఆపలుకులో చిలుకు అమృతకణాలు
ఆనడకలో చిందు వేదనాదాలు ॥ ....కను ॥

ఆబాబ చూపుకే జగము మురిసేను
ఆబాబ నవ్వుకే మనసు మురిసేను!
హస్తచాలనమందు భస్మమ్మురాలు
కనువిందు కలిగించు దివ్యాద్భుతాలు ।।....కను ||

ఆదివ్యచరణాల తిలకించుదాము
ఈజన్మ పాపాల తొలగించుదాము।
సాయీశు నామమ్ము భజియించుదాము
సంసారసాగరం తరియించుదాము ।।....కను ||

ఆతడు భగవానుడు మన సత్యసాయి
ఆత్మబంధువుమనకు శ్రీ సత్యసాయి।
అవతారమెత్తేను సాయిరాముడై
ఆదుకొనుచుండె మనపాలిదేముడై ....కను ||

—కమలేకర్ డాగోజిరావు, ఎం. ఏ; ఎం.ఇ,ఏల్.

# శ్రీ సత్యసాయి సేవా సంస్థల
# మూడవ ప్రపంచ మహా సమ్మేళనము

## కార్యక్రమములు

| | | |
|---|---|---|
| నవంబరు 17, 1980<br>సోమవారం | మధ్యాహ్నం 11 గం॥కు<br>సాయంత్రం 6 గం॥కు | విదేశములనుండి వచ్చిన భక్తుల భజనలు. |
| నవంబరు 18, 1980<br>మంగళవారం | ఉదయం 9 గం॥కు | రథోత్సవము. |
| | సాయంత్రం 4 గం॥కు | చిత్రప్రదర్శన ప్రారంభోత్సవం. |
| | సాయంత్రం 6 గం॥కు | వివిధ భాషల్లో సాయి అవతార విశేషాలతో కూర్చిన జానపద గీతావళి. |
| నవంబరు 19, 1980<br>బుధవారం | ఉదయం 8 గం॥కు | డెలిగేట్ల ఊరేగింపు. |
| | ఉదయం 9 గం॥కు | మూడవ ప్రపంచమహాసమ్మేళనంప్రారంభోత్సవం. |
| | ఉదయం 10-30 గం॥కు | విద్వత్సదస్సు. |
| | సాయంత్రం 5 గం॥ | శ్రీ హరిప్రసాద్ చౌరసియాగారి వేణుగానం; శ్రీ శివకుమార్‌శర్మగారి సంతూర్ వాదనం. |
| నవంబరు 20, 1980<br>గురువారం | ఉదయం 9 గం॥కు | వివిధ సమితుల సమావేశాలు. |
| | సాయంత్రం 4-30 గం॥కు | సమితుల నివేదికలు. |
| | సాయంత్రం 6 గం॥కు | శ్రీ మనోజ్‌కుమార్‌గారు కూర్చినభక్తిగీతాల గానం, శ్రీ జేసుదాస్, శ్రీ మహేంద్రకపూర్ గార్లచే. |
| నవంబరు 21, 1980<br>శుక్రవారం | ఉదయం 9 గం॥కు | ప్రపంచ మహాసమ్మేళన సమావేశాల సమాప్తిసమావేశం. |
| | రాత్రి 7-30 గం॥కు | శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మిగారి గానం; పండిట్ రవిశంకర్ గారి సితార్ వాదనం. |

| | | |
|---|---|---|
| నవంబరు 22, 1980<br>శనివారం | ఉదయం 10-30 గం॥కు | కింగ్‌డం ఆఫ్ సత్యసాయి (శ్రీ సత్యసాయి కళాశాల పాత విద్యార్థుల సంఘం) వార్షికోత్సవం. |
| | సాయంత్రం 5 గం॥కు | శ్రీ వి. జి. జోగ్‌గారి వయొలిన్ కచేరి. |
| | సాయంత్రం 6 గం॥కు | "కింగ్‌డం ఆఫ్ హెవెన్" నాటక ప్రదర్శన. |
| | రాత్రి 8-30 గం॥కు | శ్రీవారి జన్మదినోత్సవ సందర్భంగా బాణాసంచా ప్రదర్శనం. |
| నవంబరు 23, 1980<br>ఆదివారం | ఉదయం | శ్రీవారి దివ్యసమ్ముఖంలో పూర్ణచంద్ర సభామంటపమునందు భక్తుల సమావేశం. |
| | సాయంత్రం 4-45 గం॥కు | దీపక్ రాగం. |
| | సాయంత్రం 5 గం॥కు | శ్రీవారి దివ్యసందేశం. |
| | రాత్రి 7 గం॥కు | ఉయ్యాలోత్సవం: శ్రీమతులు పి. సుశీల, పి. లీల శ్రీ వి. రామకృష్ణ గార్లచే "రామకథా" గానం. |
| నవంబరు 24, 1980<br>సోమవారం | ఉదయం 11 గం॥కు | భజన. |
| | సాయంత్రం 5 గం॥కు | శ్రీవారి దివ్య సందేశం. |

## గ మ ని క

1980 అక్టోబర్ 1వ తేదినుండి సనాతనసారథి వార్షిక చందా రూ 6/–నుండి రూ 8/– పెంచబడినది. కాగితంధర ప్రచురణ తదితర ఖర్చులు పెరిగినందున ఈ పెంపుదల అనివార్యమైనది. చందా సంవత్సరం కంటె ఎక్కువ కాలానికి కట్టిన పక్షంలో అట్టి చందాదారులు చందాలో గల వ్యత్యాసపు మొత్తాన్ని శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతి నిలయమునకే పంపించవలసినదిగా కోరడమైనది.

విదేశములోని చందాదారులు సంచిక ముందు పేజిలో ప్రచురింపబడిన ధరలననుసరించి తమ చందా పంపవలెను.

# బాధలు—నివారణలు

శ్రీ సత్యసాయిబాబావారి దర్శనార్థం వచ్చే వేలాది మందిలో దైహికబాధల నివారణార్థం వచ్చేవారి శాతం చాలా ఎక్కువనే చెప్పాలి. కొందరు త్వరగా తమ బాధలనుండి కోలుకొని ఆనందముగా ఇండ్లకు తిరిగి వెళుతుంటారు. కొందరు దర్శనము చేసుకొని ఇండ్లకు తిరిగి వెళ్ళిన తరువాత నెమ్మదిగా కోలుకుంటారు. ఇంకా కొందరు మౌనముగా తమ ప్రదేశములనుండే బాబావారిని తమ బాధలను నివారించమని ప్రార్థిస్తూం టారు. కానీ కొందరికి తాత్కాలిక ఉపశమనము కలుగ వచ్చు, లేకపోయిన బాధ తిరిగి రావచ్చును.

చనిపోయిన వారిని కూడా బ్రతికించగల బాబావారి కున్న దివ్యశక్తిని గురించి మనకందరికిని తెలుసు. అటువంటప్పుడు యావత్తు మానవాళిని బాధలనుండి రోగాలనుండి ఎందుకు రక్షించకూడదు? అసలు మాన వులు ఆయా రోగాలతో ఎందువలన బాధపడాలి? ఈ ప్రశ్నలకు జవాబులు ప్రకృతి సిద్ధాంతాలవల్ల పొంద వచ్చునా? మొట్టమొదట మనము ఈ దైహిక బాధ లకు గల కారణములను అవగాహన చేసుకోవాలి. సూక్ష్మంగా చూస్తే అస్వస్థత అంటే స్వస్థత లేకపోవ డము. మరోలా చెప్పాలంటే దేహానికి తనకు మధ్య కానీ, దేహానికి చిత్తానికి మధ్యగానీ, మనస్సుకు తనకు మధ్యగానీ, మనస్సుకూ దేహానికీ మధ్యగానీ సామర స్యము లేకపోవటమే దేహములోగానీ, మనచుట్టూ ఉన్న ప్రపంచములోగానీ, సయ్యోద్దె లేక స్పర్ధలు రావడం సహజము. ఒకసారి స్పర్ధ వచ్చిన తరు ణంలో అది ఎంత పెద్దదవుతుందో ఎప్పుడు అంత మవుతుందో చెప్పుట కష్టము. దీనికి చిన్న ఉదాహర ణముగా మనము అతిగా భోజనము చేయడాన్ని తీసు కోవచ్చును. అట్టి సమయములో మన కడుపునందు కలిగిన బాధలనుండి తిన్నది అరిగేవరకూ తేరుకోలేము

దేహానికి వచ్చే అనేక రోగాలు చాలా సంవత్సర ముల తరబడి అకాల భోజనములవల్ల, నిద్రలేమివల్ల, అసమగ్ర ఆహారంవల్లకానీ, అతి భోజనం వల్లకానీ వస్తూంటాయి.

స్వామి, దేహాన్ని దేవాలయమనీ, భగవంతుడు నివ సించే గృహమని చెపుతుంటారు. దేవాలయమును క్రమము తప్పకుండా లోపలా బయటా శుభ్రము చేసు కుంటూ ఉండాలి. కొంత అజ్ఞానమువల్ల, కొంత ఆధు నిక విజ్ఞానమువల్ల దేవుడిచ్చిన ఆహార పదార్థముల యందు జరుగుతున్న కల్తీలవల్ల మన దేహానికి ఏది మంచిదనే విషయాన్ని మనమే నిర్ధారణ చేసుకోలేక పోతున్నాము.

ప్రస్తుత సమాజమునందు మన జీవిత విధానము మానసికముగా అనేక వత్తిడులకు ఉద్రేకములకు మన లను గురి చేస్తున్నది. ఈ రకంగా దేహానికి సంబం ధించని రెండు కారణములు అనేక బాధలకు దారి తీస్తున్నాయి. బాగా ఆలోచిస్తే ఈ బాధలకు ఇంకా లోతైన కారణాలుంటూండవచ్చు. కొన్ని రోగాలు ఆధ్యాత్మికముగా, కొన్ని విషయాలు నేర్ప డానికి మరో మార్గము లేక మనమీద నెట్టబడి

ఉండొచ్చు. ఆయా బాధలను అనుభవించడమువల్ల అటువంటి రోగమే కలిగిన మరొకరు ఎట్లా బాధననుభవిస్తారనేది ఊహించి వారిపట్ల ఏరీతిగా దయతో ప్రవర్తించాలో, ఏ సాయం చేయాలో, ఏ సలహా ఇవ్వాలో మనం తెలుసుకుంటాం. ఇట్టి పద్ధతిని ఆధునిక వైద్యులు ఆసుపత్రులలో పెద్ద పెద్ద శస్త్రచికిత్సలవల్ల కలిగే మానసిక పరిణామాలను ఒక గొప్ప అవకాశముగా తీసుకుంటున్నారు.

ఒకసారి విజయవంతంగా శస్త్రచికిత్స పొందిన రోగిని తమ అనుభవాన్ని శస్త్రచికిత్స పొందబోయే రోగికి తెలిపి తద్వారా అతనికి ధైర్యం కలిగేటట్లు చేస్తున్నారు. దైహిక బాధననుభవించేటప్పుడు మనం ఓర్పును, వినయాన్ని, మనకి సాయం చేస్తున్న వారి మీద గౌరవాన్ని కలిగియుండటాన్ని నేర్చుకుంటాము. అట్లాంటి సమయంలో "నాకెవరి సహాయం అక్కర లేదని" డంబాలు కొట్టేవారుకూడా మరొకరి సాయం పొందాల్సి వుంటుంది. ప్రతివారూ నాకెవరి సాయమూ అక్కరలేదని ఆలోచించుకుంటూ పోతూవుంటే ఆధ్యాత్మిక ప్రగతే వుండదు. మనమందరం ఒక ఏకత్వంలో భాగమని తిరిగి అందరం పవిత్రమైన ఆత్మలోకలిసి ఒకటవుతామని తెలుసుకోవాలి.

సామాన్యంగా ఒక వ్యాధి, దానిని అనుభవిస్తున్న రోగి ఆలోచనలను వస్తు ప్రపంచంనుండి ఆధ్యాత్మిక దృక్పథంపైపు మరల్చడానికి తోడ్పడుతుంది. మీదు మిక్కిలి శారీరకంగా విశ్రాంతి పొందడానికి కూడా దోహదకారి అవుతుంది. అయితే ప్రతి రోగానికి అసలైన కారణం తప్పక బాబావారికి మాత్రం తెలుస్తుంది. ప్రతివ్యక్తి పూర్వం చేసిన కర్మ ఫలితం ఈ రీతిగా అనుభవించక తప్పదు. ఎవరికో, ఏ జన్మలోనో, పూర్వజీవితంలోనో చేసిన హాని తనకు అనుభవమయ్యేందుకు వీలుగా రోగం ఆ వ్యక్తికి సంక్రమిస్తుంది. దీనికి నాకు తెలిసున్న ఒకరి అనుభవమే తార్కాణము. ఒక మహిళ కాళ్ళులేక అనేక సంవత్సరాలపాటు చక్రాల కుర్చీమీద ఆధారపడుతూండేది. అప్పుడప్పుడు ఆమెవీపుపై ఎర్రటి వాతలు కనపడుతూండేవి. ఒక జ్యోతిష్కుడు అది ఆమె పూర్వ జన్మ ఫలితమనీ ఒకప్పుడు పురాతన కాలంలో ఈజిప్టులో బానిసలపై కొరడాదెబ్బలు కొట్టే వ్యక్తిగా ఉండేదని తెలిపాడు. ఈరీతిగా కూడా రోగం వ్యక్తులకు ప్రాప్తిస్తూండవచ్చు.

ఇంకో ప్రశ్నకూడా మనల్ని వేధిస్తూ ఉంటుంది. "మనం ఏదయినా రోగానికి నివారణ కోరుకునే పక్షంలో ఏ పరిస్థితులలో నివారణ కోరుకోవచ్చు?" కొన్ని రోగాలు ఒక వైద్యుడు నివారణ చేయగలిగి అట్టి రోగాలే మరికొందరికి కలిగినప్పుడు నయం ఎందుకు చేయజాలడు? దీనికి సరిఅయిన సమాధానం తెలుసుకునే ముందు బాబావారు తన సంకల్పంద్వారా నయంచేసే రోగాలు తప్ప సామాన్యంగా రోగాలన్నీ భగవంతుడు నిర్ణయించిన సమయానికి కాని నయం కావు అనేది తెలుసుకోవాలి. రోగాన్ని నివారణ చేస్తున్న వైద్యుడు కానీ, ఆత్మశక్తిద్వారా నయం చేస్తున్న వ్యక్తిగానీ, భగవంతుని శక్తికి ఒక ప్రతీక మాత్రమే. రోగం తగ్గవలసిన సమయం ఆసన్నం కానప్పుడు రోగం పూర్తిగా నయంకాక, బాధమాత్రం కొద్దిగా ఉపశమింపవచ్చు. ఈ విధంగా అనారోగ్యం దినచర్యలో ఆహారం సరిగా తీసుకోకపోవడం, వత్తిడులు, ఎక్కువగా పనిచేయడంలాంటి వాటివల్ల కలిగిన పక్షంలో దినచర్యను క్రమబద్ధం చేసుకోవడంద్వారా స్వస్థతను పొందగల్గుతాం. అటువంటి వాటికి కర్మకు సంబంధం వుండదు.

ఒకరోగి తనకు సంభవించిన అనారోగ్యాన్ని తన ఆధ్యాత్మిక పరిణామంలో ఒక దశగా పరిగణించి కొత్త

పాఠాల్ని నేర్చుకోవచ్చునన్న దృష్టితో చూసుకుంటే, ఆ అనారోగ్యం గూర్చి మరచిపోయి అంతటిని భగవంతుని చేతిలో పెట్టి నిశ్చింతగా వుండవచ్చు. ఆ రకంగా చేసినట్లయితే దైవం ఆ వ్యక్తి బాధ్యత పూర్తిగా స్వీకరిస్తాడు.

బాబావారు కొందరిని ప్రత్యేక కారణాలకోసం స్వాస్థులుగా చేయవచ్చు. అట్టివారు దైవం రూపొందించిన పథకంలో ఏదో ఒక బాధ్యత చేపట్టి దైవ సహాయాన్ని గురించి నమ్మలేని వారిని మధ్యస్థంగా వుండి సతమతమవుతున్న వారిని, దైవసహాయంకోసం ఎదురుచూస్తున్నవారిని, భగవంతుని చెంతకు చేర్చటానికి తమ అనుభవాన్ని వ్యాపింప చేయడంద్వారా కారణ భూతులవుతారు.

మరో ప్రశ్నకూడా మనల్ని వేధిస్తుంటుంది-"కొన్ని సార్లు వ్యాధులు నివారణ కానేకావెందుకని?" ఇది అన్నింటికంటే క్లిష్టమైనది. ఒక వ్యాధిమీద రోగి మానసికంగా ఆధారపడడంవల్ల అది నివారణ కాకుండా పోతూంటుంది. ఒక్కోసారి నివారణకోసం చెప్పిన నిబంధనలు సరిగా పాటించక పోయినప్పుడు కూడా వ్యాధులు నయం కాకపోవచ్చు. కొంతమంది రోగులు తామొక వ్యాధితో బాధపడుచున్నామన్న సత్యాన్ని విస్మరించి, విశ్రాంతిని పొందజాలక నివారణాకిరణాలకు దూరమవుతుంటారు.

కర్మవల్ల వచ్చిన వ్యాధులు కర్మఫలితం పూర్తిగా అనుభవించాక వాటంతటవే నయమయిపోతాయి. అట్టి వ్యాధిగ్రస్తులకు బాబావారు ఒకటే చెపుతారు. తాను వ్యాధినుండి ఈ జన్మలో వారిని రక్షించగలననీ, అయితే వారు ఆ వ్యాధిని రెట్టింపుబాధతో తరువాత అనుభవించవలసి వుంటుందనీ చెపుతారు. అట్లా కాకుంటే కొంచెం తక్కువ బాధతో కర్మ పరిపక్వం అయ్యేవరకూ వ్యాధిని అనుభవించమంటారు.

నాఉద్దేశంలో మనం జన్మించేముందు మనం నేర్చుకోబోయే పాఠాలను బేరీజు వేసుకొని తదనుగుణంగా మన తల్లితండ్రులను ఎన్నుకుంటాం. బాధననుభవించ దలచుకొంటే శారీరకంగా ఏదో లోపమున్న దేహాన్నో, పేదరికంలో మగ్గుతున్న కుటుంబంలోనో జన్మిస్తాం. ఆనందం అనుభవించాలనుకుంటే తదనుకూలమైన కుటుంబంలో జన్మిస్తాం. ఒక్కోసారి ఆత్మ తాను ఎన్నుకున్న శరీరం సరిఅయినది కాదని గ్రహించి పుట్టుక సమయంలోనే ఆ శరీరంనుంచి తొలగిపోయి సరిఅయిన సమయంకోసం వేచిచూడవచ్చు. కొన్ని సార్లు తనదికానీ, తన తలిదండ్రులదిగానీ, కర్మ ఫలితంగా పుట్టిన కొన్ని దినాలకు చనిపోవచ్చు. ఒక చిన్న పిల్లవాడు చనిపోయినప్పుడు మనం "అనుభవించాల్సిన కాలం అంతా వదిలిపెట్టి చనిపోయాడని బాధపడుతుంటాము. కాని నిజానికి ఆ చనిపోయిన పిల్లవాడి ఆత్మ మనకు తెలియకపోయినప్పటికీ చాలా వయస్సున్నది కావచ్చు. వారు ఏదోఒక కార్యసాధన కోసం జన్మనెత్తారు. అది తీరిపోగానే మన వూహకందని రీతిలో జన్మ చాలిస్తారు.

బాధపడ్తున్నవారికి సానుభూతి చూపించి ఆ బాధ నుండి వారు స్వస్థత పొందేటట్లు మనం సాయం చేయ కల్గుతాం. మన వయస్సు ఎంతయినప్పటికినీ సమయం ఆసన్నమయినప్పుడు హుందాగా శాంతితో, సంయమనముతో భగవంతునికి చేరువయితే చాలని ఆశించి, ప్రార్థించాలి. తర్వాత జన్మగురించి తెలుసున్న వారికి ఈ శరీరాన్ని విసర్జిస్తున్నామన్న యోచన చాలా సంతోషాన్నిస్తుంది. ఆ సమయంవరకూ మనం చేయాల్సినది సోదర మానవాళికి ప్రేమనందించడం; దివ్యమైన

పరమాత్మలో సర్వులు ఏకమవ్వటానికి చేయూత నందిం చదు, మనం శారీరకంగా బాధలనుభవిస్తున్నప్పటికీ మానసికంగా మనం ఇతరులకు ప్రేమ భావాలను, స్వాంతన భావాలను, శాంతి సంయమన ఆలోచనలను అందించి తద్వారా వారికి సహాయం అందించవచ్చు, ఎందుకంటే ఆలోచనలు జీవభరితమై భూమినంతా చుట్టి రాగల్గినంత శక్తివంతమైనవి. సంతోషభరితమైన చిరు నవ్వుతో "సాయిరాం" అన్న పదం మనకు రోజంతా ఉత్సాహం అందించడమేకాక, వ్యధతో విండిన హృద యాన్ని ఉత్సాహభరితం చేయగల్గుతుంది.

హెచ్. పి. చాలోదర్ తన "ది పాత్ అఫ్ హీలింగ్" (స్వాస్థ్యానికి త్రోవ) అనే పుస్తకంలో ఈ క్రింది విధంగా వ్రాశారు. "ప్రేమను నీలో ప్రతీ సారీ మరింత పరిపూర్ణంగా వ్యక్తీకరింప చేయడం ద్వారా భయాన్ని అత్యంత శక్తివంతంగా పారద్రోల వచ్చు. తద్వారా ప్రేమ నీలోనూ నీ చుట్టుప్రక్కల కూడా రూపొన్నొందుతుంది. అపుడు బాధనుండి వ్యాధినుండి దూరమవటానికి ప్రయత్నించడానికి బదులు, వాటిని నీవు ఆహ్వానించగలుగుతావు.

అట్లా భగవదేచ్ఛను సర్వం సమర్పించిన పక్షంలో ప్రేమద్వారా బాధను, అస్వస్థతను, అనుమానాన్ని భయాన్ని కాల్చివేయగల్గుతావు.

అందువల్ల మనలను స్వామి ప్రేమించినట్లుగా మనందరం అందరినీ ప్రేమించుదాము.

అగ్గ్ వారెన్
సిడ్నీ, ఆస్ట్రేలియా

# "భక్తుల కల్పతరువు"

## "నా ధ్యానానుభవాలు"

పూజ్య మాతృశ్రీ దివ్య కృపాకటాక్షవీక్షణాలతో నా హృదయమందాధ్యాత్మిక బీజాంకురార్పణ చాలా కాలము ముందే ఏర్పడింది. నానాటికి అభివృద్ధి చెందు తూనే నిత్యసాధనకు తోడుగా, సత్యం, శాంతి, ధర్మ మార్గాల్లో పయనిస్తూనే యున్నాను.

బాబాగారిని గూర్చి మొదటినుండి సదవగాహన వుండనే వుంది. పూజ్యుల, ఆత్మీయ మిత్రుల సాహ చర్యముతో, బాబా సాహిత్య పఠనముతో శ్రీవారిమీద పరిపూర్ణ విశ్వాస మేర్పడింది. తత్ఫలితముగా "సనాతన సారథి" నా జీవిత రథాన్ని నడపటము, బాబా పటాలు ఇంటిలో వెలయటం జరిగింది. నిత్య ధ్యానములో శ్రీవారి దర్శన భాగ్యముకూడా లభిస్తుంది. ఆహా! ఎంతటి కరుణామూర్తి ఆపుట్టపర్తి సాయిమూర్తి. నా మార్గమందేదయినా సందేహము వచ్చినపుడు వెన్వెం టనే శ్రీవారి దివ్య స్మృతులద్వారా పరిష్కారమౌతు న్నాయి.

మాది ఒక పల్లెటూరు. ప్రాచీనమునుండి రాజ కీయాలకు దూరమై, ఆధ్యాత్మిక చింతనలో అగ్రస్థాయి గీతా సమాజాలతో, ప్రార్థనా సమాజాలతో, ఆధ్యాత్మిక గోష్ఠులతో అత్యున్నత స్థాయి చేరుకుంది గ్రామము. ఇటీవల కుటిల రాజనీతికి గురియై ఐక్యతచెడి అన్ని

సమాజాల కవాటాలు మూతబడ్డాయి. అన్నిటితో సంబంధం కల్గియున్న నా హృదయము తపించింది. కానీ బాబావారు "ఉద్ధరేదాత్మనాత్మానం" అని ప్రబోధించి నా తపన మటుమాయము చేసారు. అక్కడితో ప్రారంభమయింది నాకు శ్రీవారి దివ్యోపదేశము. నాటి నుండి ఏకాంత సాధనలో జీవితాన్ని నడుపుకుంటు న్నాను. అపుడపుడు పెద్దల సందర్శనచే నా హృదయ మాలిన్యాన్ని ప్రక్షాళన చేసుకుంటూ కాలము గడుపు తున్నాను.

ఆనాడు 1980 మార్చి 20వ తారీఖు అనుకుంటాను. నా ధ్యానములో నిత్యగాయత్రీ మంత్రోచ్చారణతోపాటు మహామృత్యుంజయ మంత్రము కూడా తైలధారగా వస్తుంది. మానసిక తీవ్రతలో దానిగూర్చి ఆలోచించగా "సంశయమెందుకు ?" అన్న ధ్వని హృదయాంతరాళమునుండి ప్రతిధ్వనించింది. ఇది దివ్య బాబావారి ఆదేశమని నిశ్చయించుకొని సద్గురుపదేశాన్ని విడువక ధ్యానిస్తున్నాను. ఏకాదశ దినములు గడిచాయి. నిత్యము అష్టోత్తర మంత్రోచ్చారణ జరుగుతూంది.

అది మార్చి 31వ తారీఖు. రాత్రి సుమారు 1-2 గంటల మధ్య గాఢనిద్రాపరవశత చెందియున్న సమయమది. స్థానిక ఉగ్రవాద దుండగుల ముఠా నా ఇంటిపై దాడిచేసింది. వారి రాకకు, వారి చర్యలకు నాకు కారణము తెలియదు. వాటినిగూర్చి ఆలోచించ డానికి కూడా అశక్తుడనయ్యాను. వారు తలుపులు పగులగొట్టి, బీరువాలు తెరచి ఇంటిలోని సర్వాన్ని దోచుకొని పోవటమేగాక నా ధర్మపత్ని పవిత్ర మాంగల్యాన్ని కూడా దోచుకుపోయి ఆమెను కొట్టారు. వారంతటితో తృప్తిపడక నన్ను హత్య చేయాలని కేకలువేస్తూ నామీదికి దుముకుతూన్నసమయాన, ప్రేక్షకునిలా చూస్తున్న నేను బాబావారి దివ్యస్మరణ చేసుకుంటూ అనూహ్యమయినదారిలో తప్పించుకు పోగలిగాను.

అంతటితోవారు విడువక నాగాయత్రీ పటమును నాచేతిలోని కత్తితోపొడచి పారిపోయారు. ఈ దుస్సంఘటన గూర్చి ఆలోచించగా నాప్రాణరక్షణకై బాబాగారి దివ్యమంత్రోపదేశఫలితముగా నేను రక్షింప బడ్డానని గుర్తించి, నాహృదయమందు బాబావారి పాదములకు కన్నీటిధారలతో పవిత్రాభిషేకము చేసుకు న్నాను. ఇంటిలో జరిగిన దోపిడిగూర్చి, కోల్పోయిన ఆస్తినిగూర్చి మానసికవ్యథ చెందుతూన్న నన్ను శ్రీవారు. నాధ్యానములో భ్రూమధ్యమున నిలిచి "ఇందులోనిదేది ? ఎందుకీవృధావ్యధ" అన్నదివ్య ధ్వని ప్రతిధ్వనించింది. తెలివిలోపడిన నాహృదయారాటమంతటితో సద్దుమణిగింది. మానసికేకాగ్రత దిన దినానికి తీవ్రతచెందుతున్న నాహృదయమందు నిత్య చైతన్య స్వరూపుని రూపము ధృడపడుతూంది.

అనూహ్యమయిన విపత్కర, దుస్సంఘటనగూర్చి అనేక మిత్రులు, ప్రతీకారముగూర్చి ప్రోత్సాహపరిచారు. కాని ధ్యానవిమగ్నతలో బాబావారు, "వారేమిచేసారు నిన్ను ! నిన్నేదోచేయబోయి వారిఆత్మ ద్రోహము చేసుకున్నారు." అని నన్ను ప్రబోధిస్తున్నారు. నాటి నుండి నాదృష్టి విపత్కరపరిస్థితినుండి దైవసాన్నిధ్యానికి మరలించబడి ఆత్మానంద స్థితినొందింది.

సుమారు వందదినములు స్వగ్రామమువిడిచి వున్న తరువాత ఉపాధ్యాయుడుగా నావిద్యుక్త ధర్మాన్ని నిర్వహించాల్సిన రోజు ఆసన్నమయింది. ఆ గ్రామానికి మీరువెళ్లవద్దని చాలామంది మిత్రులు, అభిమానులు, హెచ్చరించారు.

మరల మానసిక ఆందోళన ప్రారంభమయింది. ధ్యానతీవ్రతలో బాబాగారిని ప్రార్థించాను నాకర్తవ్యాన్ని

ప్రబోధించమని. బాబావారు "జాతస్య ధృవో ర్మృత్యుః'' అన్న సూక్తి హృదయాంతరాళము నుండి ప్రతిధ్వనింపజేసారు. వెంటనే శరీరము పులకాంకితమయింది. ఆత్మజ్ఞానము ప్రబోధితమయింది. మన ప్రాణము యింకొకరి చేతిలో యుండదని, పుట్టినవారు చావకతప్పదని. మృత్యువు పాంచభౌతికమగు దేహానికిగాని నాకుకాదని. నిత్యుడను, శాశ్వతుడను అమృతతుల్యుడను నేనని జ్ఞానముపొందిన వాడనై, నావిద్యుక్త ధర్మనిర్వహణకు నిర్భయుడనై ఉద్యుక్తుడనయ్యాను.

ఈ విధముగా తనకోటానుకోట్ల భక్తులకు పుటపర్తివాసి, శ్రీసత్యసాయివారెట్లు జీవితములలో ఆదుకుంటున్నారో గదా! కనీసము వారిదివ్యదర్శనము ప్రత్యక్షంగా చేసుకొనే భాగ్యముకూడా నోచుకోలేక. ఆ మాత్రము వారిమార్గాన్ని అనుసరించిన నన్నే యీవిధముగా నాయోగక్షేమాలన్నీ చూసుకుంటున్న శ్రీవారు తన్ను అనన్య భక్తితో సేవిస్తున్న భక్తులనెలా ఆదుకుంటారో వేరేనిదర్శనమేల?

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" అని కృష్ణపరమాత్మ గీతలో హామీయిచ్చారు. కానీ శ్రీసత్యసాయి తన భక్తుల యోగక్షేమాలు నిత్యము చూచుకుంటారు. ఆహా! సాయి భక్తులెంత ధన్యులు. "ధన్యోస్మి! ధన్యోస్మి!! ధన్యోస్మి!!! ఓంతత్‌సత్"

జీ రాములు.

## పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి—(హవార్డ్ మర్ ఫెట్ ఆంధ్రానువాదం—అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 5. | ధర్మవాహిని | 1-25 | 0-15 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 8. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 9. | మణిమాల | 2-00 | 0-20 |
| 10. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 11. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 12. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 13. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 14. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 15. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 16. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 17. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 19. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 20. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 21. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు_67, బృందావనములోని 'వ్రజ్ బృందావన్ ప్రెస్' నందు పి. చంగ్‌కకోటిచే ముద్రింపబడి, యస్. కస్తూరిచే. "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్. శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యస్. కస్తూరి. యం. యే., బి. యల్.

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

## పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 8 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 8 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 20 | 30 | 9 | 12 | | 12 |
| ఆఫ్రికా | 20 | 50 | 9 | 18 | | 18 |
| అమెరికా | 20 | 55 | | 20 | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 20 | 35 | | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 20 | 50 | | 20 | | 20 |
| బర్మా | 20 | 30 | | 12 | | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 20 | 50 | | 18 | | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 20 | 55 | | 20 | | 20 |
| శ్రీలంక | 10 | 20 | 8 | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు. ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిష్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కావున రిజిష్టర్డ్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

---

(పుస్తకసూచి 248వ పుటలో చూడండి)

మార్పుచెందేది దేహమనీ, మారనిది ఆత్మ అనీ పరిశీలించి తెలిసి కోండి. అనంతమైన విశ్వవ్యాపకమైన మీ ఆత్మ తత్త్వము గుర్తించు కోవాలి. ఆలోచనావివేచనా ఉన్న మానవులకు ఈ తత్త్వమును గుర్తించు కోవలసిన బాధ్యత ఉన్నది. ఈ కర్తవ్యం నిర్వర్తించటం వల్ల వ్యక్తికే కాక దేశానికికూడా మేలు కలుగుతుంది. భారతీయులు ఈ బాధ్యతను గుర్తించి నిర్వర్తించటం వల్లనే భారతదేశం జగద్గురు పీఠం ఆక్రమించ గలిగింది. కాని భారతీయులు ఆత్మతత్త్వమును ఉపేక్షచేసి భౌతికసుఖాల కోసమూ సాంఘికగౌరవాల కోసమూ ప్రాకులాడటంవల్ల దేశం స్పర్ధల వంతంలో దిగబడిపోయింది. మీ ఆస్తులకూ, సంపదలకూ యాజమాన్యం ఈశ్వరునిది. ఆయన పక్షాన వ్యవహరించే ధర్మకర్తలు మీరు. అదే విధంగా కుటుంబమునకు కూడా ధర్మకర్తలుగా వ్యవహరించి మీ యింటి లోని వారిని ప్రేమతో సాకుతూ మార్గదర్శకులు కావలెను. ఆ విధంగా సంసార బాధ్యతలు కూడా పవిత్రంగా చేసుకొంటూ కుటుంబ నిర్వహణ మును ఆధ్యాత్మిక పురోగతి సాధనంగా మార్చుకోవాలి.

—బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64